# ఒక్కక్షణం! నా మాట వినండి. (చదవండి)

ఇంగ్లీషులో మాట్లాడాలంటే ఏం చెయ్యాలి?

ఇంగ్లీషు మాట్లాడాలి.

ఇంగ్లీషులో మాట్లాడడం ఎలా వస్తుంది?

ఇంగ్లీషు మాట్లాడితే వస్తుంది.

ఎన్ని రకాలుగా తిప్పితిప్పి ఈ ప్రశ్న అడిగినా సమాధానం ఇదే. ఇంతే! ఏ భాష మాట్లాడడం అయినా అది అలవాటు వల్లే వస్తుంది. తప్పులతోనైనా సరే తడుముకోకుండా మాట్లాడేయాలి. అలావాటు పడిపోవాలి. తప్పలు క్రమంగా పోతాయి.

ఆ సాధనకి ఇలాంటి పుస్తకాలు దారి చూపుతాయి. ఈ పుస్తకంలో చాలా పేజీలలో పైన బాక్సులో కొన్ని వాక్యాలున్నాయి. అవి సామెతలు, సూక్తులు. ఆ పాఠం చదువుతున్నప్పుడు ఆ వాక్యాలను కంఠస్థం చేయండి. మీ సంభాషణలలో సందర్భం వచ్చినప్పుడల్లా ఆ వాక్యాలను అంటుంటూ ఉండండి. సిగ్గుపడకండి. ఈ పాఠాలు మౌనంగా మనసులోనే చదవకండి. బిగ్గరగా చదవండి. మీ మాతృభాషలో మీరు ఏవేగంతో మాట్లాడుతున్నారో ఆ వేగం అలవాటయ్యేలా చదవండి. ఎన్ని వీలయితే అన్ని వాక్యాలను నోటికి వచ్చేలా చదవండి. మీ సంభాషణలలో ఉపయోగించండి. ఉదాహరణకు ఈ పుస్తకంలో I shall go to Rajahmundry అనే వాక్యం ఉంది. మీకు “ మేము రేపు ఏలూరు వెళ్తాము” అని చెప్పేసందర్భం వస్తే We shall go to Eluru tomorrow అని చెప్పండి.

ఇంగ్లీషు మాట్లాడడంలో మనకు చాలా ఇబ్బంది కలిగించేది present tense లో third person singular లో verb ఉపయోగించడం. He drinks tea వాక్యంలో drinks అనడం, Does he drink tea అని ప్రశ్నించడంలో does drink, he does not drink tea అనిచెప్పడంలో does not drink అనడం చాలా కష్టం అవుతుంది. విసుగొచ్చేస్తుంది. కొంతకాలం తప్పదు. ప్రయత్నించండి. మానకండి. తప్పొస్తే నాలిక కరుచుకోకండి. ఎప్పుడు తీరిక దొరికినా He goes, she smiles, it runs, he plays, she sings, the cow gives, does he play? does she dance? does it run? he does not write, it does not run, she does not like అంటూ మీకు తెలిసిన ఏడెనిమిది Verb లని ఉపయోగిస్తూ ప్రక్కన ఎవరితోనో అంటున్నట్లు గట్టిగా మాట్లాడుతుండండి. అయిదారు రోజుల్లో

నలభై verbలు లొంగిపోతాయి. ఇంక ఆ తరువాత మనం ఎంతసులువుగా, ఎంత ధారాళంగా, తుడుముకోకుండా అబద్ధాలు ఆడుతామో అంత బాగా ఇంగ్లీషు మాట్లాడగలం.

తరచుగా రోజూ అప్పుడో పావుగంట, ఇప్పుడో పది నిముషాలు ఇలా మొత్తం మొత్తంలో ఓ గంటసేపు ఇంగ్లీషు చదవండి. బిగ్గరగా చదవండి. కొన్ని వాక్యాలని కంఠస్థం చెయ్యండి. న్యూస్ పేపర్ ఓ పేజీ అయినా లేదా ఎడిటోరియల్ అయినా చదవండి. చదవడంతో పాటూ ఇంగ్లీషుని వినండి. సి.వి.ఆర్. న్యూస్ ఛానల్లో రోజూ ఇంగ్లీషు వార్తలు వస్తాయి. వినండి. డి.డి. న్యూస్ ఛానల్ వినండి. ఇంగ్లీషులో క్రికెట్ కామెంట్రీ కూడా వినవచ్చు.

చదవడం కంటే వినడం, వినడం కంటే మాట్లాడడం ఎక్కువ మేలు. మూడింటినీ విడిచి పెట్టకండి.

ఇటీవల డిగ్రీ తరగతుల్లో ప్రవేశించిన దగ్గర నుండీ యువతీయువకులు కంప్యూటర్ సెంటర్లలో చేరుతున్నారు. కంప్యూటర్ విజ్ఞానం వస్తే ఉద్యోగాలు వస్తాయని. మంచిదే. నేర్చుకోండి. కానీ ఇంగ్లీషులో మాట్లాడగలగడం అంతకంటే ముఖ్యమని తెలుసుకోండి. బాగా కంప్యూటర్ విజ్ఞానం ఉండి బి.టెక్, ఎం.సి.ఏ లు పాసయి సాఫ్ట్‌వేర్ ఉద్యోగాల కోసం టెస్టులు వ్రాసి వాటిలో కూడా పాసయి కూడా ఇంటర్వ్యూలో ఇంగ్లీషు బాగా మాట్లాడడం చేతకానందువల్లే ఉద్యోగాలకు సెలెక్ట్ కావడంలేదు. ఎవర్నయినా అడగండి. మాథ్స్, సైన్స్ లో బియస్సీ ఫస్ట్‌క్లాసులో పాసయి బి.ఎడ్ పాసయిన యువతులు పెళ్ళి చేసుకొని ఏ హైద్రాబాదో వెళ్ళి ఖాళీగా ఉండడం ఎందుకని అక్కడి ప్రైవేటు స్కూల్స్‌లో టీచర్ ఉద్యోగానికి ప్రయత్నిస్తారు. నువ్వు మాథ్స్ లో ఎంత తెలివైనదానివైనా ఇంగ్లీషులో ధారాళంగా మాట్లాడడం, సబ్జెక్టుని ఇంగ్లీషులో తడుముకోకుండా చెప్పడం చేతకాకపోతే నీకు ఉద్యోగం రాదు.

సిటీలలో ఎక్కడా ఉద్యోగం రాదు. ప్రైమరీ క్లాసులకి టీచరుగా కూడా నిన్ను తీసుకోరు. అక్కడ 5,6 తరగతుల విద్యార్థులు కూడా ఇంగ్లీషు మనకంటే బాగా మాట్లాడుతారు. వాళ్ళకి ఇంగ్లీషులో పాఠం చెప్పడానికి నువ్వు ప్రయత్నిస్తున్నావు.

టెన్త్ క్లాసు, ఇంటర్‌ల నుండే ఇంగ్లీషులో మాట్లాడడానికి ప్రయత్నం చేయండి. అలవాటు చేసుకోండి.

ఈ పుస్తకంలో ఎక్సర్‌సైజ్‌లు ఉన్నాయి. వాటి జవాబులు కాగితం మీద

వ్రాయకండి. నోటితో అనండి. రెండు మూడు సార్లు అన్నాక, పుస్తకం చివర జవాబులు (కీ) ఉన్నాయి. మీ జవాబుల్ని అక్కడున్న జవాబుల్తో సరి చూసుకోండి.

అలా ఈ పుస్తకంలో నాలుగైదు సార్లు చదివాక, మీకు ఇంకా పైస్థాయి పుస్తకాలు చదవాలనిపిస్తే మీ టెన్త్‌క్లాసు ఇంగ్లీషు Non-detailed text పుస్తకాలున్నాయి. The Merechant of Venice షెర్లాక్ హెూమ్స్ డిటెక్టివ్ కథ ఇలాంటి పుస్తకాలని పారెయ్యకండి. మళ్ళీ చదవండి.

ఈ పుస్తకం చదివాక ఈ practice ఇంకా కొనసాగించాలని ఇంకో పుస్తకం చదవాలని అనిపించిందంటే నాకు అది చాలు. మంచి సంతోషం, గర్వం కలుగుతాయి.

Please make me feel proud.

ఈ పుస్తకం వ్రాయడంలో నాకు ప్రోత్సాహాన్నిచ్చి, సలహాలిస్తూ, తప్పుల్ని సరిచేస్తూ సహాయపడినవారు కీ॥శే॥ శ్రీ సి.వి.కె. అవధానులు గారు (గూటాల). వారు నాకు నిత్య స్మరణీయులు.

మా మిత్రుడు యన్. జయరాజు (రిటైర్డ్ ప్రిన్సిపాల్, గవర్నమెంటు జూనియర్ కాలేజి, చాగల్లు) గారి కుమారుడు వర్ధిష్ణువు చిరంజీవి స్వరూప్ (తేజస్వి గ్రాఫిక్స్, గణపతి సెంటర్, నిడదవోలు) ఈ పుస్తకం డి.టి.పి. చెయ్యడం దగ్గరనుంచి పుస్తకం ప్రింటింగ్ వరకు మొత్తం బాధ్యత వహించి కృతకృత్యుడయ్యాడు. అతనికి శుభాకాంక్షలు.

*The best way to learn a subject is to write a book about it.*

# Lesson - 1



## Language is a vehicle of thought

భావ ప్రకటన సాధనము భాష. కాని భావ ప్రకటనకు భాష ఒక్కటే సాధనము కాదు. అనేక ఇతర సాధనాలు కూడా ఉన్నాయి.



1. సంజ్ఞలు (gestures) : నోటంట మాట పలక్కుండానే తలని అడ్డంగానో, నిలువుగానో ఊపడం ద్వారా మన తిరస్కారాన్ని గానీ ఆమోదాన్ని గానీ తెలియచేయవచ్చు. చేతులు ఊపి ఇటు రమ్మని లేదా అటు వెళ్ళమని తెలియచేయవచ్చు.

2. రంగులు : మన జాతీయ జెండాలో ఒక్కొక్క రంగు ఒక్కొక్క భావానికి సంకేతమంటారు. ట్రాఫిక్ సిగ్నల్స్‌లో ఎరుపు, పసుపు, ఆకుపచ్చ రంగుల భావాలు మనకు తెలుసు. ఎవరైనా అధికారికి తమ నిరసన తెలియచేయడానికి నల్లరంగు బ్యాడ్జీలు ప్రదర్శిస్తారు.

రోడ్డు మీద పోయే వాహనాల డ్రైవర్లకి దగ్గర్లో స్కూలు ఉందని హాస్పటల్ ఉందని, ఎదురుగా ప్రమాదకరమైన వంపు వస్తోందని, ఇలాంటి భావాలకు కొన్ని చిత్రాలని సంకేతాలుగా ఉపయోగిస్తారు. అందరికి తెలిసినది రెండు ఎముకలని క్రాస్‌గా వేసి మధ్యలో పుర్రె వేస్తే అపాయము అని భావము. ఇవన్నీ భావ ప్రకటన సాధనాలే.



కానీ ఇవన్నీ చాలా పరిమితమైన భావాలను తెలియచేయడానికి ఉపయోగిస్తాము. కానీ విస్తృతమైన సంక్లిష్టమైన భావాలని వ్యక్తీకరించడానికి ఇవి సరిపోవు. దానికి భాషే అత్యంత సమర్థమైన సాధనము.



మరి మనిషికి భాష ఎలా సంక్రమిస్తుంది?

మాతృభాష అంటాం. అంటే తల్లి ద్వారా లేక తండ్రి ద్వారా వారసత్వంగానో, జెనిటిక్ గానో సంక్రమిస్తుందా?

ఒక తెలుగు తల్లిదండ్రులకు పుట్టిన పసిగుడ్డును ఆ పళంగా ఏ బొంబాయో తీసుకు పోయి హిందీ భార్యాభర్తల దగ్గర వదిలేస్తే ఆ పసిబిడ్డకి పెద్దయ్యాక హిందీ భాషే అలవడుతుంది. కానీ తెలుగు సంగతే తెలీదు.

ఇంట్లోను పరిసరాల్లోనూ వినిపించే భాషే పిల్లలకు అలవడుతుంది. కనుక భాష సంక్రమించేది కాదు. అలవాటు చేసుకొనేది. ఇంట్లోనూ, పరిసరాల్లోనూ వినిపించే భాష సులభంగా అలవడుతుంది. అలా ఒక మనిషి ఎన్ని భాషలైనా అలవరచుకోవచ్చు.

ఇంకొక ముఖ్య విషయం: మనిషికి పసితనంలో అప్పుడప్పుడే మాటలు వస్తూన్న వయస్సు నుంచి పరిశీలిస్తే - పసితనంలోనే ఏ భాషనైనా సులభంగా నేర్చుకోగలం. వయస్సు పెరిగేకొద్దీ కొత్త భాషను అలవాటు చేసుకొనే శక్తి తగ్గిపోతూంటుంది.

ఈనాడు సులభంగా అలవడే వీలు దాటిపోయిన వయస్సు అంటే పదిహేనేళ్ల దాటిపోయిన వయస్సు వచ్చిన యువకులు ఇంట్లోగానీ, పరిసరాల్లోగానీ వినబడని భాషని, అదే ఇంగ్లీషు భాషని మాట్లాడడం అలవరచుకోవాలంటే అది సంభవమా? సులభసాధ్యమా? ఈ ప్రశ్నలకు జవాబు సంభవమే... సాధ్యమే.

ఒకడి మెదడులో ఒక ఆలోచన వచ్చిందంటే - అది ఖచ్చితంగా మాతృభాషలోనే వస్తుంది. ఆ భావాన్ని ఇంగ్లీషులోకి తర్జుమా చేసుకొని మాట్లాడాలి. ఎంతటి వాడైనా పరభాష ఎంత గొప్పగా అనర్గళంగా మాట్లాడే వాడైనా ఇదే ప్రక్రియ.

మాతృభాషలో మెదడుకు తట్టిన భావాన్ని ఎంత వేగంగా, నిర్దుష్టంగా అంటే తప్పులు లేకుండా అనువాదం చెయ్యగలము అన్న దాని మీదే పరభాషలో మాట్లాడగలగడం ఆధారపడుతుంది.

సరే! మెదడుకు ఒక ఆలోచన తట్టింది. ఆభావాన్ని ఇంగ్లీషులో వ్యక్తం చెయ్యాలి. అంటే ముందుగా ఏ Verb ని ఉపయోగించాలి. ఆ Verb ని ఏ Tense లో ప్రయోగించాలి అనేది ముందు నిర్ణయమవ్వాలి.



A

1. నేనొక విద్యార్థిని అని ఇంగ్లీషులో చెప్పాలంటే.

 I am a Student.

2. మనము భారతీయులము.

 We are Indians.

3. ఆయన ఉపాధ్యాయుడు.

 He is a teacher.

4. ఆమె డాక్టరు.

 She is a doctor.

5. అది బల్ల.
   That <u>is</u> a table.
6. ఇది కుర్చీ.
   This <u>is</u> a chair.
7. అది/ ఇది కుక్క.
   It <u>is</u> a dog.
8. అవి ఆవులు.
   Those <u>are</u> cows.
9. నీవు అబద్దాలకోరువి.
   You <u>are</u> a liar.
10. మీరు సైనికులు.
   You <u>are</u> soldiers.

ఇంగ్లీషులో there తో మొదలయ్యే వాక్యనిర్మాణం ప్రత్యేకమైనది.

11. గోడ మీద పిల్లి ఉన్నది.
   There <u>is</u> a cat on the wall.
12. మా క్లాసులో పదిమంది విద్యార్థులున్నారు.
   There <u>are</u> ten students in our class.

B

13. నాకు ఇద్దరు సోదరులున్నారు.
   I <u>have</u> two Brothers.
14. మాకు ఒక కారుంది.
   We <u>have</u> a car.
15. ఆవుకి రెండు కొమ్ములుంటాయి.
   The cow <u>has</u> two horns.
16. ఆమెకు మధురమైన కంఠ స్వరం ఉంది.
   She <u>has</u> a melodius voice.
17. బల్లకి నాలుగు కాళ్లుంటాయి.
   The table <u>has</u> four legs.
18. వాళ్లకి ఒక ఇల్లుంది.
   They <u>have</u> a house.

C

19. ఆవు పాలిస్తుంది.

The cow gaves milk.

20. పిల్లులు ఎలుకలని చంపుతాయి.
Cats kill rats.

21. మనము భారత్‌ను ప్రేమిస్తాము.
We love India.



22. సచిన్ క్రికెట్ ఆడుతాడు.
Sachin plays cricket.

23. సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు.
The sun rises in the east.



24. తేనె తియ్యగా ఉంటుంది.
Honey tastes sweet.

పై వాక్యాలలో Underline చేసిన పదాలను verb లు అంటారు.

భాగంలో am, are, is లు verb లు

subject I అయితే verb - am

III Person ఏకవచనం (singular number) he, she, it అయితే verb - is

You (నీవు అయినా మీరు అయినా) verb - are.

బహువచనం (Plural number) we, they అయితే verb - are ఇవి వాక్యంలో subject యొక్క - ఉండుట - be - అంటే The state of being ను తెలియచేస్తాయి.



I am a student అంటే నేనొక విద్యార్థిగా ఉన్నాను.

అన్నట్లన్నమాట ఉండుట = be

be యొక్క వివిధ రూపాలే am, is, are వీటి వివరం తరువాత ఉంటుంది.



(a) The verb denotes the state of being of a subject

B - విభాగంలో

Has లేదా have - verb లు.

వాక్యంలో Subject First, Second, Third Person లలో ఉంటుంది.

First person - Singular number (ఏకవచనం) - I,

Plural number (బహువచనం) - We

II Person Singular - You
Plural - You

III Person Singular - He, She, it

Plural - they

నేను, మేము, నీవు మీరు కాక ఇంకేదయినా, ఎవరైనా, వాడు, దేవుడు, మా ఫాదర్, ఆవు, బల్ల ఏదైనా III Person.

Subject Third person లో ఉండి Singular number (ఏకవచనం) అయితే Verb - has. ( Subject He, She, it అయితే )

plural number (బహువచనం) They అయితే verb - have

subject I ఏకవచనం( I person singular) అయినా We(బహువచనం) II person you (నీవు లేక మీరు) అయినా verb - have

has - have అంటే కలిగి ఉండుట (possession)

we have a car అంటే మేము ఒక కారును కలిగి ఉన్నాము అన్నట్లు

The verb denotes the state of possession of a subject

C - భాగంలో

Give, Kill, love, play, rise, taste అనే Verb లు వాటి Subject లు the cow, cats, we, sachin, the sun, honey లు చేసే పనిని తెలియచేస్తాయి.

Subject - Third Person - singular లో ఉంటే Present tense లో Verb కి 'S' గానీ 'es' గానీ చేర్చాలి. Ex: The cow gives

(C) The verb denotes the state of action of a subject.

(a), (b), (c) వాక్యాలు మూడూ కలిపితే verb లక్షణం అవుతుంది.

verb - భూత కాలము (Past tense) వర్తమానకాలము (Present tense) భవిష్యత్ కాలము (Future tense) అని మూడు కాలాల్లో ఉంటుంది. ఇంగ్లీషులో ఈ మూడు tense లలో ఒక్కొక్క దానిలో నాలుగేసి రకాలున్నాయి. అంటే మొత్తం మూడు నాలుగులు పన్నెండు రకాలుంటాయి.

వీటిలో Present tense లోని నాలుగు రకాలలో మొదటిది Simple present tense .

పైన ఉదహరించిన A,B,C విభాగాల్లోని వాక్యాల్లోనిverb లు Simple present tense లో ఉన్నాయి.

Simple present tense is used to denote universal truths and habitual actions.

The sun rises in the east, Honey tastes sweet. ఇవి ప్రకృతి సత్యాలు Sachin plays వంటి వాక్యాల్లో అలవాటుగా చేసే పనులు.

I have a car, she is a doctor వంటి వాక్యాల్లో భూత, భవిష్యత్, వర్తమాన కాలాలు మూడింటిలోను (ఒక పరిమితిలో) వర్తించే పనులు

సూచించబడుతున్నాయి.

ఈ మూడు సందర్భాలలోనూ verb ని simple present tense లో ఉపయోగించాలి.

సామెతలు అనుభవ సత్యాలు కనుక అవి ఎప్పుడూ Simple present tense లోనే ఉంటాయి.

Ex. 1. Honesty <u>is</u> he best policy. 2. All that glitters <u>is</u> not gold. 3.Fortune <u>favours</u> the brave వంటివి.

ఎన్నోతరాల అనుభవమే సామెతల రూపంలో కనబడుతుంది. అవి శాశ్వత సత్యాలే.



<u>EXERCISE - 1</u>

Translate the following sentences into English.

1. భారతదేశము నా మాతృభూమి. (మాతృభూమి - Mother land )
2. తెలుగు నా మాతృభాష. (మాతృభాష - Mother tongue )
3. ఆవు గడ్డి తింటుంది.
4. భూమి సూర్యుడు చుట్టూ తిరుగుతుంది.
5. ఏనుగుకి ఒక తొండము ఉంటుంది.
6. వారంలో ఏడు రోజులుంటాయి.
7. వారానికి ఏడు రోజులుంటాయి.
8. ఆంధ్రప్రదేశ్‌లో 23 జిల్లాలున్నాయి.
9. ఆంధ్రప్రదేశ్‌కు 23 జిల్లాలున్నాయి.
10. కాళిదాసు గొప్ప కవి.
11. రామాయణ, మహాభారతములు గొప్ప ఇతిహాసములు (ఇతిహాసము-epic )
12. అస్పృశ్యత పాపము. (అస్పృశ్యత - untouchability )
13. నడక మంచి వ్యాయామము. (నడక - Walking )
14. అతడికి దృఢనిశ్చయం ఉంది. (దృఢనిశ్చయం - Strong Determination )
15. నాకు ఆకలిగా ఉంది.
16. దేవుడు అంతట ఉన్నాడు.
17. బాలు పాటలు పాడుతాడు.
18. అస్సాంలో తరచుగా వర్షం కురుస్తుంది.
19. మా నాన్న 'హిందు' పేపరు చదువుతాడు.
20. ఖర్జూరాలు అరబ్ దేశాలలో పండుతాయి.

*Knowledge is Power*

# Lesson - 2

ప్రశ్నలు అడగడం ఎలా?

ఇంగ్లీషులో Questions రెండు రకాలు.

1."Wh" questions 2.Yes - No answer questions

Who, Whom, When, Where, Why, What, how, how many, how much, how often, how far పదాలతో మొదలయ్యే ప్రశ్నలని wh questions అంటారు.

జవాబు అవును Yes అని గానీ కాదు No అని గానీ వచ్చే ప్రశ్నలను Yes - No questions అంటారు.

1. నీకు మామిడి పళ్ళు ఇష్టమా? Do you like mangoes? అనే ప్రశ్నకి అవును ఇష్టమే అని కానీ లేదు ఇష్టం కాదు అని కానీ జవాబు వస్తుంది.

2. నీవు అతడిని చూసావా? Have you seen him?

3. లత నాట్యం చేస్తుందా? Does Latha dance?

Yes - No answer questions ఇలా ఉంటాయి.

Do, does, has, have, is వంటి మాటలతో మొదలవుతాయి.

వీటిని Auxiliary Verbs అంటారు.

be, am, is, are, was, were

| | | |
|---|---|---|
| have | has | had |
| do | does | did |
| shall | should | |
| will | would | |
| can | could | |
| may | might | |
| must | need | dare |

ఈ 24 auxiliary verbs. వీటిని helping verbs అని కూడా అంటారు.

He is a teacher లో is - principal verb.

He is reading a book లో verb - is reading. ( reading ఒక్కటే verb కాదు )

ఇక్కడ is - helping (auxiliary) verb

read - principal verb.
An auxiliary verb is one which helps other verbs to form other tenses. Helping verb is not necessary in simple present and simple past tenses.
Simple present tence లో 'B' విభాగంలో ఇచ్చిన state of possesion ను తెలియచేసే verb లు has, have లు ఆ వాక్యాల్లో principal verbs. "కలిగి ఉండడం" అర్థానిస్తున్నాయి. కానీ
I have lost my purse వాక్యంలో have కి కలిగి ఉండడం అని అర్థం లేదు. 'lost' prinicipal verb పోగొట్టుకున్నాను అనే అర్థం ఇస్తుంది. మరి have పని ఏమిటి?
verb ని, present perfect tense లో చెప్పడానికి have - helping verb గా ఉంది.
ఈ 24 helping verbs లో కొన్ని helping verb లుగా మాత్రం ఉపయోగపడతాయి. కొన్ని స్వతంత్రంగా prinicipal verbs గానూ helping verbs గానూ కూడా ఉపయోగపడతాయి. వీటి వివరాలు ముందు వస్తాయి. ఇప్పుడు ముందుగా A భాగంలో వాక్యాలు చూద్దాం. ఈ వాక్యాల్లో ఉండుట (be) అనే అర్థంలో be రూపాలే verbs.

1. I am a student.
Q. Who are you?
   I am a student.
Q. Are you a student?
   Yes, I am a student. .. affirmative sentence అంటారు.
   No; I am not a student ( ఇది negative)
2. We are Indians
   Who are you?
   Are we Indians?
   Yes; we are Indians.
   No; we are not Indians.
3. He is a teacher.
   Who is he?
   Is he a teacher?
   Yes; he is a teacher.

No; he is not a teacher?

4. She is a doctor.
who is she?
Is she a doctor?
Yes; she is a doctor.
No; she is not a doctor.



5. That is a table.
what is that?
Is that a table?
Yes; that is a table.
No; that is not a table.



6. This is a chair.
What is this?
Is this a chair?
Yes; this is a chair.
NO; this is not a chair.

7. It is a dog?
What is it?
Is it a dog?
yes; it is a dog.
NO; it is not a dog.



8. They are cows.
What are they?
Are they cows ?
Yes; they are cows.
No; they are not cows.



9. You are a liar.
Am I a liar?
Yes; you are a liar.
No; you are not a liar.

10. You are soldiers.
Who are we?

Are we soldires?
Yes; you are soldiers.
No; you are not soldiers.

11. There is a cat on the wall.
What is there on the wall?
Where is the cat?
Is there a cat on the wall?
Yes; there is a cat on the wall.
No; there is not a cat on the wall.

12. There are ten students in our class.
How many students are there in your class?
Are there ten students in your class?
Yes; There are ten students in our class.
NO; There are not ten students in our class.

B. భాగంలో have, has లు prinicipal verb లుగా తమ స్వంత అర్థం కలిగియుండుటను తెలియచేస్తాయి.

Subject III person singular number లో ఉంటే verb-has.
I person - singular (I) అయినా plural (We) అయినా
II Person singular (you) plural కూడా you అయినా
III person plural they అయినా verb-have
Question - negative forms లో వాక్యం ఉన్నప్పుడు
have - do have. do not have
has - does have. does not have గా ఉంటాయి.

13. I have two brothers.
How many brothers do you have?
Do you have two brothers?
Yes; I have two brothers.
No; I do not have two brothers.

14. We have a car.
Do you have a car?
Yes; we have a car.
No; I do not have a car.

15. The cow has two horns.
    How many horns does the cow have?
    Does the cow have two horns?
    Yes; the cow has two horns.
    No; the cow does not have two horns.
16. She has a melodious voice
    Does she have a melodious voice?
    Yes; she has a melodious voice.
    No; She does not have a melodious voice.
17. The table has four legs.
    How many legs does the table have?
    Does the table have four legs?
    Yes; the table has four legs.
    No; the table does not have four legs.
18. They have a car.
    Do they have a car?
    Yes; they have a car.
    No; they do not have a car.
19. The cows gives milk.

ఈ వాక్యంలో subject the cow. ఇది III Person Singular

Simple present tense లో subject III person singular లో ఉంటే

verb కి 'S' గానీ 'es' గానీ చేర్చాలి.

give కి s చేర్చితే gives అయ్యింది.

question form .......does give

negative answer లో does not give.

what does the cow give?

Does the cow give milk?

Yes; the cow gives milk.

No; the cow does not give milk.

20. cats kill rats.



Subject - cats. ఇది Singular కాదు. plural కనుక verb - kills అనలేదు. kill గానే ఉంది. Subject కనుక The cat అయితే మాత్రం Kills అని చెప్పాలి.



What do cats kill?

cats kill rats.

Do cats kill rats?

Yes; cats kill rats.

No; cats do not kill rats.

21. Sachin plays cricket.

What does sachin play?

Does sachin play cricket?

Yes; Sachin plays cricket.



No; Sachin does not play cricket.

22. We love India.



Do you love India?

Yes; we love India.

No; we do not love India.

23. The sun rises in the East.

Where does the sun rise?

Does the sun rise in the East?

Yes; The sun rises in the East.

No; the sun does not rise in the East.

24. Honey tastes sweet.
    How does honey taste?
    Does honey taste sweet?
    Yes; honey tastes sweet.
    NO; honey does not taste sweet.



**EXERCISE - 2**

Translate the following sentences into English and write the question forms and answers in both affirmative and negative forms.

1. కలాం ఒక శాస్త్రవేత్త.
2. సంవత్సరంలో 12 నెలలుంటాయి.
3. మా నాన్న ఉదయం కాఫీ తాగుతాడు.
4. నీరు 100  వద్ద మరుగుతుంది.
5. ఇంద్ర ధనుస్సులో ఏడు రంగులుంటాయి.
6. ఇంద్ర ధనుస్సుకు ఏడు రంగులుంటాయి.
7. లత కథలు వ్రాస్తుంది.
8. నక్షత్రాలు రాత్రి సమయంలో ప్రకాశిస్తాయి.
9. వారణాశి గంగానది ఒడ్డున ఉన్నది.
10. నూజివీడు మామిడి పళ్లకు ప్రసిద్ధి.
11. కుక్కలు మొరుగుతాయి.
12. ప్రపంచంలో సుమారు 2796 భాషలున్నాయి.
13. పక్షులు ఎగురుతాయి.
14. బాలురు గాలి పటాలను ఎగరవేస్తారు.
15. ఒంటెకు పొడవైన మెడ ఉంటుంది.

**Politics is war without blood shed and war is politics with blood shed**

# Lesson - 3

ఇప్పుడు జరుగుతున్న పనిని చెప్పవలసి వచ్చినపుడు - ఉదాహరణకి

1. నేను పదవతరగతి చదువుతున్నాను. అని చెప్పాల్సివస్తే

   I am Studying tenth calss. అని చెప్పాలి.

2. మా నాన్నగారు స్టేట్‌బ్యాంకులో పనిచేస్తున్నారు.

   My father is working in the state bank.

3. బాలురు హాకీ ఆడుతున్నారు.

   The boys are playing hockey.

4. వర్షం వస్తోంది.

   It is raining.

వాక్యం it తో మొదలవడం ఇంగ్లీషులో ప్రత్యేకత.

Simple present tence లో natural truth గా చెప్పాలంటే

అస్సాంలో తరచు వర్షం కురుస్తుంది.

It often rains in Assam.

బృందావన్ గార్డెన్స్‌ని చూడడం నేత్రానందంగా ఉంటుంది.

It is delightful to see the Brindavan gardens.

ఈ వాక్యంలో verb - is

'to see' కాదు.

It అంటే అది లేక ఇది అనే అర్థం కాదిక్కడ.There is a cat on the wall లో there లాంటిది.

దీన్ని Impersonal it అంటారు. అది లేక ఇది అనే అర్థంలో it - personal it.

5. పోలీసులు దొంగని తరుముతున్నారు.

The Police are chasing the thief.

6. మేము పాము కోసం వెతుకుతున్నాము.

We are searching for the snake.

7. రమణయ్య గారు గ్రామరు చెపుతున్నారు.

Mr. Ramanayya is teaching grammar.

8. మాధవి ఇంగ్లీషు నేర్చుకుంటుంది.

Madhavi is learning English.

9. రాజు లండన్‌లో ఉంటున్నాడు.

Raju is living in London.

10. లీలామహల్‌లో మాయాబజార్ ఆడుతుంది.

Mayabazar is showing at Leela Mahal.

ఇప్పుడు జరుగుతున్న పనిని చెప్పే tense ని present continuous tense అంటారు.

The present continuous tense denotes an action which is taking place at the time of speaking.

ఈ tense లో Verb లో రెండు మాటలుంటాయి.

be form (helping verb) + verb + ing.

Verb + ing ని present participle అంటారు.

be forms:

| Present tense | past tense | past participle |
|---|---|---|
| be | was | been |
| am | was | been |
| is | was | been |

are were been

1 వ వాక్యంలో am studying - verb.

am - be form ఇది helping verb.

study - prinicipal verb.

study + ing= Studying - present participle

subject I అయితే be form - am

He, She, it (III person singular) అయితే is

we, you, they, (plural number) అయితే are

present continuous tense లో be form కూడా present tense లోనే ఉండాలి.

being కూడా be - రూపమే. ఇది continuous tense లో passive voice లో వస్తుంది.

# Lesson - 4



ప్రశ్నలు అడిగే విధానం:

ఎప్పుడైనా Question దాని answer ఒకే tense లో ఉండాలి. Question ఏ tense లో ఉంటే జవాబు అదే tense లో చెప్పాలి.

I am studying tenth class.

Q1. What class are you studying?

Q2. Are you studing tenth class?

A1. Yes; I am studying tenth class.

A2. No; I am not studying tenth calss.

2. My father is working in the state bank.

Q. Where is your father working?

Is your father working in the State Bank?

Negative - No; my father is not working in the state bank.

3. The boys are playing hockey.

What are the boys playing?

Are the boys playing hockey?

Negative - No; the boys are not playing hockey.

4. It is raining.

Is it raining?

Negative - No; It is not raining.

5. The Police are chasing the thief.

Who are chasing the thief?

Whom are the police chasing?

Are the police chasing the thief?

No; The police are not chasing the thief.

( ఇంగ్లీషులో police నిత్యబహువచనం. తెలుగులో కందులు, బియ్యము లాగ police ఒక్కడే ఉన్నాడా? ఎక్కువ మంది ఉన్నారా? అనవసరం.The police are అనే అనాలి. పోలీస్ ఒక్కడే అని స్పష్టంగా చెప్పాలంటే The police man అనాలి. అప్పుడే is వాడాలి.)

6. We are searching for the snake.

What are you searching for?

Are you searching for the snake?

Negative: No; we are not searching for the snake.

7. Mr. Ramanayya is teaching grammar?

Who is teaching grammar?

What is Mr. Ramanayya teaching?

Is Mr. Ramanayya teaching grammar?

8. Madhavi is learning English.

What is Madhavi learning?

Who is learning Englinsh?

Is Madhavi learing English?

Negative - No; Madhavi is not learning English.

9. Raju is living in London.

Where is Raju Living?

Is Raju living in London?

No; Raju is not living in London.

10. Mayabazar is showing at Leela Mahal.

What is showing at Leela Mahal?

Where is Mayabazar showing?

Is Mayabazar showing at Leela Mahal?

## EXERCISE -3

Translate the folling Telugu sentences into English and frame the relevant question forms too.



1. ఈ సినిమాలో రాజా నటిస్తున్నాడు.
2. సౌజన్య ఎపిపిఎస్‌సి పరీక్షలకు తయారౌతోంది.
3. రవీంద్ర పార్లమెంటు ఎన్నికల్లో పోటీ చేస్తున్నాడు.
4. మా తమ్ముడు ఈ రోజు యుఎస్ నుండి వస్తున్నాడు.
5. నువ్వు అబద్దం ఆడుతున్నావు.
6. నేను రామాయణం చదువుతున్నాను.
7. చీకటి పడుతోంది.
8. వాళ్ళు పోట్లాడుకొంటున్నారు.
9. టమోటాలు కేజీ అరవై రూపాయలకు అమ్ముడవుతున్నాయి.
10. సూర్యుడు అస్తమిస్తున్నాడు.
11. రాధ పేపరు చదువుతోంది.
12. ఎన్జీవోలు కొత్త పేస్కేల్స్ కోసం ఆందోళన చేస్తున్నారు.
13. మేము టీవీలో క్రికెట్ చూస్తున్నాము.
14. వీరేంద్ర క్రొత్త నవల వ్రాస్తున్నాడు.
15. శాంత వంట చేస్తోంది.

**Peace is the interval between two wars.**

# Lesson - 5

1. నేనిప్పుడే వచ్చాను.
   I have just come.
2. రైలు ఇప్పుడే ఫ్లాట్‌ఫాం వదిలింది.
   The train has left the platform.
3. వాళ్ళిక్కడ పదేళ్ళ నుంచి ఉన్నారు.
   They have lived here for ten years.
4. జయశ్రీ ఈ పుస్తకం చదివేసింది.
   Jayasree has already read this book.
5. మేము క్రికెట్ మ్యాచ్ గెలిచాము.
   We have won the cricket match.

ఇప్పుడే పూర్తి అయిన పనిని present perfect tense లో చెప్పాలి. పై వాక్యాల్లో underline చేసిన భాగం verb ఇందులో రెండు మాటలున్నాయి. has or have + past participle form of the verb.

Past participle form of the verb అంటే-

ప్రతి Verb కి present tense form, past tense form, past participle form (future tense form కాదు). అని మూడు రూపాలుంటాయి. ఈ మూడు రూపాలు ఆధారంగానే Verb కి అన్ని tense లలో రూపాలు ఏర్పడుతాయి. ఈ మూడు రూపాలని verb యొక్క conjugation అంటారు. past participle అనేది tense కాదు. అదొక రూపం. కొన్ని tense లలో Verb లో ఇదొక భాగం అవుతుంది.

కొన్ని Verb లకి conjugation ఇలా ఉంటుంది.

| Present tense | past tense | past participle |
|---|---|---|
| Be | was | been |
| Am | was | been |
| Is | was | been |
| do | did | done |
| has | had | had |
| have | had | had |

| | | |
|---|---|---|
| bring | brought | brought |
| buy | bought | bought |
| build | built | built |
| catch | caught | caught |
| feel | felt | felt |
| fell | felled | felled |
| fall | fell | fallen |
| learn | learnt | learnt |
| leave | left | left |
| feed | fed | fed |
| lose | lost | lost |
| make | made | made |
| say | said | said |
| sell | sold | sold |
| teach | taught | taught |
| tell | told | told |
| think | tought | tought |
| read | read | read |
| become | became | become |
| begin | began | begun |
| break | broke | broken |
| choose | chose | chosen |
| drive | drove | driven |
| drink | drank | drunk |
| eat | ate | eaten |
| fight | fought | fought |
| fly | flew | flown |
| flow | flowed | flowed |
| give | gave | given |
| grow | grew | grown |
| hold | held | held |
| know | knew | known |

| | | |
|---|---|---|
| lie | lay | lein |
| lay | laid | laid |
| run | ran | run |
| stick | stuck | stuck |
| strike | struck | struck |



ఇవి కొన్ని verb లు మాత్రమే. ఇంకా చాలా ఉన్నాయి. రెండో పాఠంలో పేర్కొన్న auxilary verbs లో have, has లు ఉన్నాయి. present perfect tense లో ఇవి helping verbs.



has or have + past participle
has or have + spoken (speak- spoke- spoken)

has ఎప్పుడు ఉపయోగించాలి? have ఎప్పుడు ఉపయోగించాలి?

Subject
I
We
You
they
} అయితే - have

I have seen, we have played, you have eaten, they have brought

Subject He
She
It
} అయితే - Has



He has written, she has sold, It has gone.



నా భోజనం ఇప్పుడే అయింది.

I have had my lunch.

ఈ వాక్యంలో have - present perfect tense లో helping verb
had - ఇది have కి past participle - ఇది principal verb

present perfect tense is used to denote an action

a) Just completed.

b) a Past action as continuing to the present

1. రైలు (ఇప్పుడే) ప్లాట్‌ఫాం మీదకొచ్చింది.

The train has arrived on the platform.

2. నేను పుస్తకం చదివేసాను.

I have read this book.

ఎప్పటికి చదవడం పూర్తి అయింది? ఉదయమే పూర్తి అయిందా? ఇప్పడే ఒక క్షణం క్రితమే పూర్తి అయి పుస్తకం మూసేనా? అంటే ఎప్పడైనా కావచ్చు.



కాని I have read this book an hour ago. అంటే తప్పు.

టైము తప్పని సరిగా చెప్పాలంటే.



I read (రెడ్) this book an hour ago అనాలి. (simple past tense) ago, yesterday, last week ఇలాంటి కాల సూచిక పదాలు (adverbs of time) Present Perfect tense లో వాడకూడదు.

3. నేనిక్కడ పదేళ్ళు పనిచేసాను. (ఇప్పటివరకు)

I have worked here .................. ten years.

I have worked here ........................................................ the year 2000.

ఇది 2010 సంవత్సరం అయితే... రెండు వాక్యాలకు ఒకటే అర్థం. కానీ 10 సం।। లు ని perid of time అని the year 2010 అంటే point of time అని అంటారు. period of time అయితే .................... లో prepostion for వాడాలి. point of time అయినపుడు ........................లో prepostion ............since వాడాలి.



I have worked here for ten years.

I have worked here since the year 2000

for గాని since గాని లేకుండా I have worked in 2000 అంటే వాక్యం తప్పు. ఈ సందర్భంలో have worked అని present perfect వాడకూడదు.



Simple past tense లో

I worked here in year 2000 అని చెప్పాలి.

4. వాడు ఢిల్లీ బయల్దేరాడు.

He has set out for Delhi. (set -set -set)

5. ఆమె పర్సు పోయింది.

She has lost her purse. (Lose - lost - lost)

ever, never, so far, yet పదాలను ఉపయోగించేప్పుడు present perfect tense ను ఉపయోగించాలి. ప్రశ్నలో ever ఉంటే answer negative అయితే never వాడాలి.

6. నువ్వు తాజ్‌ను ఎప్పుడైనా చూసావా?

Have you ever seen the Taj?

Yes; I have seen.

Yes; I have often seen.

No; I have never seen.

7. ఇంతవరకు పదిమంది గెస్టులే వచ్చారు.

Only ten guests have come so far.

8. ఆయన ఇంత ఉదారంగా ఉండడం నేనెరుగను.

I have never known him to be so generous.

9. అతడికి ముప్పైయేళ్ళు. ఇంకా ఉద్యోగం రాలేదు.

He is thirty. He has not got a job yet.

10. ప్రధాన మంత్రి రాజీనామా చేసేరు.

The prime minister has resigned.

***EXERCISE-4***

Translate the following sentences into English.

1. గౌతమి ఎక్స్‌ప్రెస్ ఇప్పుడే ఫ్లాట్ ఫాం మీద కొచ్చింది.
2. ఆమెకు నలభైయేళ్ళు. ఇంకా పెళ్ళి చేసుకోలేదు.
3. ఇప్పటికి నవలలో ఆరవై పేజీలు చదివాను.
4. ఎప్పుడైనా వారణాసి వెళ్ళావా?
5. మోహన్ ఈ నెలలో రిటైర్‌య్యాడు.
6. విజయ్ ముప్పైయేళ్ళ సర్వీసు పూర్తి చేసాడు.
7. నేను సిగరెట్లు కాల్చడం మానేసాను.
8. ఆమె అంత కోపంగా ఉండడం నేనెప్పడూ చూడలేదు.
9. అయిదేళ్ళుగా నేను మానాన్నను చూడలేదు.
10. ఆస్ట్రేలియన్‌లు ఈ గ్రౌండ్‌లో ఎప్పుడూ గెలవలేదు.
11. ఆర్నెల్ల నుంచి రామకృష్ణ సస్పెన్షన్‌లో ఉన్నాడు.

# Lesson-6

1. నేను మాఫ్రెండ్ కోసం రెండు గంటల నుంచి ఎదురుచూస్తున్నాను.

I have been waiting for my friend for two hours.

This sentence means that

1. I began waiting two hours ago.
2. I am still waiting
3. I shall cotinue to wait for some more time.

I have waited for my friend for two hours.

ఇది Present perfect tense లో వాక్యం దీని అర్థం

1. I began waiting for my.friend two hours ago
2. I am waiting till this moment.

రెండు వాక్యాలకు తేడా -

మొదటి వాక్యంలో waiting అనే పని future లోకూడా కొనసాగుతుంది.

రెండవ వాక్యం ప్రకారం waiting ఇకపైన కొనసాగదు.

మొదటి వాక్యంలో have been waiting - Verb

ఇది present perfect Continuous tense లో ఉంది.

have / has + been + present participle.

1. ఆమె నాలుగు రోజులు నుంచి జ్వరంతో ఉంది.
   She has been having fever for four days.
2. వాళ్ళు తొమ్మిదింటి నుంచి ఆడుతున్నారు
   They have been playing since 9 0 clock.
3. నిన్నట్నుంచి వర్షం కురుస్తోంది.
   It has been raining since yesterday.
4. ఆమె వారం నుంచి ఆ పుస్తకం చదువుతోంది.
   She has been reading .that book for one week.

subject................

I, We , You, They అయితే have been+ Present Participle

He, She, It, (Third person singular) అయితే has been+ Present Participle

***EXERCISE- 5***

Translate the following sentences into English.

1. నేను రెండేళ్ల నుంచి ఇంగ్లీషు నేర్చుకొంటున్నాను.
2. ఉద్యోగులు ఇరవై రోజుల నుంచి ఆందోళ (agitation) చేస్తున్నారు.
3. పాప గంట నుంచి ఏడుస్తుంది.
4. APSRTC ఏభై యేళ్ల నుంచి బస్సులు నడుపుతోంది.
5. ఈ ఫిల్మ్ 200 రోజుల నుంచి నడుస్తోంది.
6. గోపాలం గారు 2000వ సంవత్సరం నుంచి ఇంగ్లీషు కోచింగ్ క్లాసులు నడుపుతున్నారు.
7. ఆమె రెండు గంటల నుంచి బొమ్మ గీస్తోంది.
8. ఇక్కడ రెండేళ్ల నుంచి వర్షాలు కురవడం లేదు.
9. నాని ఉదయం నుంచి టివి చూస్తున్నాడు.
10. గంట నుంచి వాడి ముక్కు నుంచి రక్తం కారుతోంది.

## <u>RECAP</u>

Present tense లో నాలుగు రకాలూ పూర్తి అయ్యాయి. past, future tense ల లో కూడా ఈ నాలుగు రకాలు ఉంటాయి. ఇంతవరకు చూసిన present tense లో నాలుగు రకాలని ఎప్పుడెప్పుడు ఉపయోగించాలి. వాటి మధ్య తేడాలు ఏమిటో ఇంకోసారి చూద్దాం.

1. నేను పాడుతాను.(అలవాటు కనుక simple present tense లో చెప్పాలి)

| | | |
|---|---|---|
| Affirmative | I | sing |
| Negative | I | do not sing. |

2. నేను పాడుతున్నాను. (ఇప్పుడు జరుగుతున్న పనిని present continuous లో చెప్పాలి.

I am singing.
I am not singing.

3. నేనిప్పుడే పాడాను. ( ఇప్పుడే పూర్తి అయిన పనిని present perfect tense లో చెప్పాలి.

I have sung.
I have not sung.
నేను ఏడింటి నుంచి పాడాను.
I have sung since 7o clock.
I have sung for two hours.

5. నేను రెండు గంటల నుంచి పాడుతున్నాను.

పాడడం అనే పని ఇంత క్రితం మొదలైంది. ఇప్పుడూ జరుగుతోంది. ఇంకా కొనసాగుతుంది. కనుక present perfect continuous tense లో చెప్పాలి.

I have been singing for two hours.

2. He has breakfast at 9 am (Habit)
He is having breakfast.
He has (just) had breakfast.
He has been having breakfast.

3. She writes. - she does not write.
She is writing.
She has written.
She has been writing.

4 . They play.
they are playing.
They have played.
They have been Playing.

5. It often rains in Assam.
It is raining.(now)
It has rained
It has been raining



## ***EXERCISE- 6***

ఇప్పుడు ఈ present tense లోని నాలుగు రకాలని ఉపయోగిస్తూ ఒక విషయం గురించి వ్రాయాలి.

Descriptive (వర్ణనాత్మకములైన) passages ని present tense లోనే చెప్పాల్సిఉంటుంది. మా ఊరు అనే అంశం మీద ఒక paragraph వ్రాయాలి. ముందు మనం చెప్పదలుచుకున్న అంశాలని ఒక్కొక్క వాక్యాన్ని మనసులో అనుకొని ఇంగ్లీషులోకి Translate చేసుకుంటూ చెప్పాలి.

మా ఊరు తాళ్ళపూడి.

ఇది పల్లెటూరు. మండల కేంద్రం కూడా.

ఇది గోదావరి ఒడ్డున ఉన్నది.

ఇక్కడ జనాభా సుమారు పదివేలు.

90 శాతం మంది దిగువ మధ్య తరగతి వారు.

వ్యవసాయము వీరి ప్రధాన వృత్తి.

ఇక్కడ రైతులు వరి, చెరకు, ప్రత్తి, పొగాకు, కూరగాయలు పండిస్తారు.

రాజమండ్రి ఇక్కడికి సమీప పట్టణం.

ఇక్కడకి పాతిక కిలోమీటర్ల దూరం.

ప్రతి అరగంటకు బస్సులు ఉంటాయి.

ఈ మధ్య తాళ్ళపూడి వేగంగా అన్ని రంగాల్లోనూ అభివృద్ధి చెందుతోంది.

ఇక్కడ ఒక ప్రభుత్వ జూనియర్ కళాశాల ఉంది. ఒక ప్రైవేటు జూనియర్ కాలేజి మరియు డిగ్రీ కాలేజి ఉన్నాయి.

ప్రైవేటు హైస్కూళ్లు పుట్టగొడుగుల్లా పెరుగుతున్నాయి.

ఇక్కడ Primary health Centre ఉంది.

ఎమర్జన్సీ పరిస్థితులలో రాజమండ్రి వెళ్లిపోతారు.

ఇక్కడ అందరూ గోదావరి నుంచి నీరు తెచ్చుకుంటారు.

సాగు నీరు కోసం ఒక లిఫ్ట్ ఇరిగేషన్ కాలువ ఉంది.

ఇక్కడ జీవితం ప్రశాంతంగా ఉంటుంది.

నాకు మా ఊరంటే ఇష్టం.

**History is the continuous diologue between the past and present**

# Lesson-7

1. శివాజీ గొప్పరాజు.
   Sivaji was a great King.
2. రోమియో జూలియట్‌లు ప్రేమికులు.
   Romeo and Juliet were lovers.
3. మొదట్లో ఇంగ్లీషు కేలెండర్‌లో 10 నెలలే ఉండేవి.
   There were only ten months in a year in the English Calender in the begining.
4. దశరధుడుకి నలుగురు కొడుకులు.
   Dasaratha had four sons
5. షేక్స్పియర్ 37 నాటకాలు వ్రాసాడు.
   Shakespeare wrote thirty seven Plays
6. భారతదేశం 1947 ఆగష్టు 15న స్వాతంత్ర్యం పొందింది.
   India got Independence on 15th August 1947
7. ఇంగ్లీషు వాళ్ళు భారతదేశాన్ని 200 యేళ్ళు పరిపాలించారు.
   The British ruled over India for 200 years
8. నేను రెండేళ్ల క్రితం ఇంటర్ పాస్ అయ్యాను.
   I passed Intermediate two years ago.
9. లత క్రిందటేడు పెళ్ళి చేసుకుంది.
   Latha married last year.
10. రావణుడు సీతను ఎత్తుకు పోయాడు.
    Ravana kidnapped Sita.

ఈ వాక్యాల్లో అండర్‌లైన్ చేసిన పదాలు Verb లు Verb యొక్క Conjugation లో రెండో రూపాలివి. జరిగిపోయిన సంగతులను చెప్పడానికి ఉపయోగించే ఇవి Past Tense రూపాలు. ఈ Tense ని Simple Past Tense లేదా Past indefinite Tense అంటారు.

Simple Past Tense is used to denote an action which took place in the Past not having anything to do with the present.

అందుకునే దీన్ని Tense of history అంటారు.

Simple Past Tense లోలాగనే ఈ Tense లో కూడా Verb లో ఒకటే పదము ఉంటుంది. అది Verb యొక్క Conjugation లో రెండో రూపం.
Simple Present Tense లో do,does లాగ Simple Past Tense లో helping verb - did (Passed = did Pass)
InterogatiVe (question form) did eat negative form లో did not eat వస్తాయి. did తరువాత present tense రూపమే రావాలి.

Did ate కాదు did eat అనే ఉంటుంది.

వాక్యంలో Principal Verb was, were అయినప్పుడు question form లో did ఉండదు. Negative form లో 'not' ఉంటుంది. did రాదు.

1. Sivaji was a great king
   Who was Sivaji?
   Was Sivaji a Great King?
   Affirmative - Yes; Siviaji was a great king.
   Negative - No: Sivaji was not a great king.
2. Thee were only ten months in a year in the English Calender in the begining
   How many months were there in the English calender in the begining?
   Were there ten months in a year in English Calender in the begining?
   Negative - No; there were not ten months in a year in the English Calender in the begining.
3 Romeo and Juliet were lovers.
   Were Romeo and Juliet lovers?
4. Dasaratha had four sons.
   How many sons did Dasaratha have? (Did have = had)
5. Did shakespeare Write 37 Plays ?.
   Yes, Shakespeare wrote 37 Plays.
   No; Shakespeare did not write 37 Plays.
6. India got independence on 15th August 1947.
   When did India get independence?
   Did India get independence On l5th August 1947?
7. The British ruled over India for 200 years?
   How long (For how many years) did the British rule over India?

Did the British rule over India for 200 years?

8. I passed intermediate two years ago.
When did you pass Intermediate?
Did you pass Intermediate two years ago?
How many years ago did you pass intermediate?

9. Latha married last year.
When did Latha marry?
Did Latha marry last Year?
No; Latha did not marry last year?

10. Ravana Kidnapped Sita.
Who Kidnapped Sita?
Whom did Ravana Kidnap?
Did Ravana Kidnap Sita?
No; Ravana did not kidnap sita

ఇంత క్రితం నేర్చుకున్న Simple Present Tense తో పోల్చుకుంటే,
Kalam is a Scientist - Verb - is (simple Present tense)
Sivaji was a great King Verb - was (Simple Past Tense).
They are soldiers (Verb - are - Simple Present Tense)
Savarkar brothers were Patriots (verb - were - simple past tense)
The elephant has a trunk (verb- has - simple present tense)
Dasaratha had four Sons (verb - had-simple past tense)
Latha sings songs (verb - sings - Simple present tense)
Valmeeki wrote the Ramayana (verb - wrote- Simple past tense)

ఈ ఉదాహరణలని చూస్తే Verb యొక్క Conjugation లో మొదటి రూపం Simple Present Tense -లో Verb అయితే ఆ Verb యొక్క రెండో రూపమే Simple Past Tense -లో Verb అవుతుంది.

| | | |
|---|---|---|
| Find | Found | Found. |
| Found | Founded | Founded |
| Is | was | been |
| Are | were | been |
| has | had | had |
| have | had | had |
| write | worte | written |
| sing | sang | sung |

మొదటి రూపం Simple Present Tense - లోను రెండో రూపం Simple Past Tense - లోనూ Verb లు అవుతాయి.

***EXERCISE : 7***

Translate the follwing sentences into English and frame their question forms and answer q±estn forms in affirmative and negat ive forms as well.



1. నెహ్రూ ఇండియాకు తొలి ప్రధాన మంత్రి.
2. హిట్లర్ నియంత.
3. రామదాస్ శివాజీకి గురువు.
4. లైలా మజ్నూలు ప్రేమికులు.
5. లవకుశులు కవలలు ( కవలలు = Twins )
6. కృష్ణ దేవరాయల ఆస్థానంలో 8 మంది గొప్ప కవులుండే వారు. ( ఆస్థానము = Court )
7. ఒకప్పుడు ఇంగ్లాడుకు గొప్ప సామ్రాజ్యం ఉండేది. ( సామ్రాజ్యము = Empire )
8. ఆయనకు నలుగురు కొడుకులుండేవారు.
9. కొలంబస్ అమెరికాను కనిపెట్టెను. (కనిపెట్టు = to discover )
10. స్వరూప 2005 లో 10 వ తరగతి పాసయ్యింది.
11. హరిహర - బుక్క సోదరులు విజయ నగర సామ్రాజ్యాన్ని స్థాపించారు. ( స్థాపించుట = to found )
12. బుద్ధుడు అహింసను బోధించాడు. (బోధించుట = to preach )
13. డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ మొదటి రాష్ట్రపతి అయ్యారు. (అగుట = to become )
14. గాంధీజీ లండన్‌లో బారిస్టర్ చదివారు.
15. మా నాన్న నేనంటే చాలా ఇష్టపడేవాడు.
16. క్రీ॥శ॥ 1752వ సంవత్సరంలో 355 రోజులే ఉన్నాయి.
17. ఇప్పటి ఇంగ్లీషు కేలెండరు క్రీ॥పూ॥ 45వ సంవత్సరంలో మొదలైంది.

**Conversation is like a boat. If the entire weight rests on one side, the boat will sink.**

# Lesson-8



1. నిన్న రమేశ్‌ను కలిశాను. అప్పుడతడు పేపరు చదువుతున్నాడు.
   I met Ramesh yesterday. Then he was reading the news paper.



2. మా అక్క పెళ్ళి అయినపుడు నేను పదోతరగతి చదువుతున్నాను.
   I was studying tenth class when my sister married.
3. నేను కాలేజికి వెళ్తూండగా ఏక్సిడెంట్ చూసాను.
   I saw an accident while I was going to college.
4. ఇళ్ళు కాలిపోతుంటే వాళ్ళు బావి త్రవ్వుతున్నారు.
   They were digging the well while the houses were burning.
5. నిన్న 9 గంటలకు నేను టిఫిన్ చేస్తున్నాను.
   I was having breakfast at 9 am, yesterday

గతంలో ఒకానొక సమయంలో జరుగుతూన్న పనిని చెప్పాలంటే Past Continuous Tense ని ఉపయోగించాలి.

The Past Continuous tense marks an action as going on in the past.

పైన ఉదహరించిన 1 వ వాక్యంలో Verb లు met, was reading



2వ వాక్యంలో Verb లు married, was studying

3వ వాక్యంలో Verb లు saw, was going

was reading, was studying, was going ఈ verb లు Past Continuous Tense లో ఉన్నాయి. ఇవి అప్పుడు - ఒకానొక సమయంలో జరుగుతున్న పనులను తెలియచేస్తున్నాయి. అవి ఎప్పుడు ఏ సమయంలో జరుగుతున్నాయో met, married, saw అనే Verb లు తెలియచేస్తాయి.



4వ వాక్యంలో were digging, were burning లు verb లు. గతంలో ఒకానొక సమయంలో జరుగుతూన్న పనులను తెలియజేస్తున్నాయి. రెండు పనులూ జరుగుతూనే ఉన్నాయి. ఒకటి జరుగుతున్నపుడు రెండోది జరుగుతోంది.

5వ వాక్యంలో Verb - was having.

ఇది గతంలో (నిన్న 9 గంటలకు) జరుగుతూన్న పనిని తెలియజేస్తున్నది. వాస్తవంగా వ్యవహారంలో ఇలా రెండు Verb లు ఉపయోగం అవసరం ఉండకపోవచ్చు. ఎందుకంటే మాట్లాడుకొనే ఇద్దరికీ ఆ పని జరుగుతున్న సమయం తెలుస్తూనే ఉంటుంది. కనుక అప్పుడిలా రెండు Verb లని ఉపయోగించాల్సిన అవసరం ఉండదు.

Past Continuous Tense లో Verb ల form అచ్చంగా Present Continuous Tense లో లానే ఉంటుంది. ఒక్కటే తేడా Present Continuous Tense లో helping verb - be form

Singular number అయితే am, is

Plural number అయితే are

ఈ helping verbs మూడింటికి Past Tense రూపాలు was, were

ఇవే Past Continuous లో helping verb లు గా ఉంటాయి.

was / were + Present Participle (verb+ing)

Singular అయితే was + Present Participle (going etc)

Plural అయితే were - Present Participle (Playing etc)

**GOD: G for generator**
**O for organiser**
**D for Destroyer**

# Lesson-9



Past Continuous Tense లో ప్రశ్నలు అడగడం:

1. I met Ramesh yesterday when he was reading the newspaper.

Q.1 When did you meet Ramesh?
I met Ramesh yesterday.
What was Ramesh doing when you met him?
Ramesh was reading the newspaper when I met him

Q.2 Did you meet Ramesh when he was reading the newspaper?
No, I did not meet Ramesh when he was reading the newspa per.
Was Ramesh reading the newspaper when you met him?

II. My sister married when I was studying tenth Class.

Q.1 When did your sister marry?
Q.2 What class were you studying when your sister married?
Q.3 Were you studying tenth class when your sister married?
Q.4 Did your sister marry when you were studying tenth class?

III. I saw an accident while I was going to college
When did you see an accident?
What did you see while you were going to college?
Did you see an accident while you were going to college?
Were you going to college when you saw an accident?



IV. They were digging the well while the houses were burning
When were the houses burning ?
Were they digging the well while the houses were burning?
Were the houses burning while they were digging the well?

V. I was having breakfast at 9a.m. yesterday
When were you having breakfast yesterday?
Were you having breakfast at 9 am. yesterday?

## *EXERCISE: 8*

**Translate the following sentences into English and form the Questions too.**

1. 19వ శతాబ్ధంలో ఇంగ్లీషువారు ఇండియాను పాలించేవారు.
2. ఆమె వంట చేస్తుండగా అతడు వంట గదిలో ప్రవేశించాడు.
3. లత పాడుతూఉంటే రాధ డాన్స్ చేస్తున్నది.
4. కమల్ నటిస్తుంటే నాకు కళ్ళంటా నీళ్ళు కారుతూఉన్నాయి.
5. రోమ్ నగరం తగలబడి పోతూంటే నీరో ఫిడేలు వాయిస్తున్నాడు.
6. మేము టీవీ చూస్తూంటే దొంగ ఇంట్లో ప్రవేశించాడు.
7. రామ్మూర్తిగారు పాఠం చెబుతూంటే మణి నిద్ర పోతుంది.
8. రమణ సినిమాలో నటీస్తూండగా ఏక్సిడెంట్‌కి గురి అయ్యాడు.
9. లాంబా క్రికెట్ ఆడుతూ గ్రౌండ్‌లో చనిపోయాడు.
10. నిన్న ఉదయం 9 గంటలకు వర్షం కురుస్తోంది.

**Bad goods require better Packing**

# Lesson - 10

1. పోలీసులు వచ్చేటప్పటికి దొంగ తప్పించుకొని పోయాడు.
   The thief had ecaped before the police came
2. మేం ప్లాట్ ఫాంను చేరుకొనేటప్పటికి రైలు స్టేషన్ వదిలేసింది.
   The train had left station when we reached the platform.
3. వాళ్ళొచ్చే సరికి పెళ్ళి అయిపోయింది.
   The marriage had been over when they arrived there.

పై వాక్యాల్లో అండర్‌లైన్ చేసినవి Verb లు. ఒక్కొక్క వాక్యంలో రెండేసి Verbs ఉన్నాయి. అంటే రెండు పనులు ఉన్నాయి. రెండూ జరిగిపోయినవే. ఒకటి ముందు జరిగింది రెండోది తరువాత జరిగింది.

1 వ వాక్యంలో ముందు జరిగింది. The thief had escaped

2 వ వాక్యంలో ముందు జరిగింది.The train had left

3 వ వాక్యంలో ముందు జరిగింది.The marriage had been over

Past Perfect tense లో చెప్పిన పని ముందు జరిగినది.

1 వ వాక్యంలో తరువాత జరిగింది. the police came

2 వ వాక్యంలో తరువాత జరిగింది. we reachd the plotform.

3 వ వాక్యంలో తరువాత జరిగింది. they arrived there.

ఈ మూడు Verbe లు Simple Past Tense లో ఉన్నాయి. Simple Past Tense లో జరిగిన పని తరువాత జరిగినది.

మొదట జరిగిన పనులను చెప్పే Verbe లు..........

had escaped
had left
had been

ఈ మూడు Verb లు Past Perfect Tense లో ఉన్నాయి. ఇప్పుడొకసారి Present Perfect Tense ని గుర్తు చేసుకొంటే

It has eaten I have writern we have played ఈ tense లో Verb have/has+eaten (eat - ate - eaten) - (past participle form)

have, has లకు Past tense form had కనుక had + past paticipie -

had eaten, had written, ఇవి past perfect tense రూపాలు.

ముందు జరిగిన పని ఏది తరువాత జరిగిన పని ఏది అని తెలుసుకోవడానికి before, after లను కూడా వాడవచ్చు. అప్పుడు ముందు జరిగిన పనిని Simple Past Tense లో కూడా చెప్పవచ్చు. Past Perfect Tense లో కూడా చెప్పవచ్చు.

The thief had escaped before the police came.
The thief escaped before the police came.
The train had left the station before we reached platform.
The train left the station before we reached the platform.

before, after ఉపయోగించకుండా చెప్పాలంటే ముందు జరిగిన పనికి Past Perfect Tense మాత్రమే ఉపయోగించాలి.

రెండు Past action లు లేకపోతే మాత్రం ఈ Past Perfect Tense ఉపయోగించరాదు.

I had gone to London last month - wrong
I Went to London last month - Correct

ఇంకో ప్రయోగం: Vijaya told me that she had fever:
2. My father asked her where she had gone.
3. Divakar enquired us if we had passed.

ఎవరో ఇంతక్రితం చెప్పిన - లేదా - అడిగిన విషయాన్ని మనం ఇప్పుడు చెపుతున్నపుడు - వాక్యంలో మొదటి భాగం.

Vijaya told me
My father asked her
Divakar enquired us

ఇంతక్రితం ఎవరు ఎవరితో అన్నారో చెప్పేదీ భాగం. ఇది Simple Past Tense లో ఉంది. ఇది Simple Past Tense లో ఉంటేనే తరువాత భాగం

She had had fever

ఇందులో had had -verb దీనిలో మొదటి had - past perfect tense లో auxialary verb.

రెండో had ఇది has కి Past participle form

has - had - had
she had gone.
we had passed.

ఇవి Past perfect tense లో ఉన్నాయి.

The teacher asked us if we had done the home work

The guru enquired with his disciples how often they had visited the temple in a week

Past perfect terse లో మరొక ప్రయోగం.

మనం అనుకున్నది, ఆశించినది జరగలేదు.

Hope, Expect, Think, intend, mean, suppose and want ఈ verb లతో నెరవేరని ఆశలను వ్యక్తంచెయ్యడానికి

1. We had hoped that you would attend the function.

Function కి నువ్వు వస్తావనుకున్నాం. కానీ నువ్వు రాలేదు అని అర్థం.

2. They had intended to go to Tirupathi.

3. I had expected that I should get first prize.

Past Perfect tense marks a past action as already completed before

1. Some Point of time in the Past.

2. The happening of a past action

## *EXERCISE: 9*

**Translate the foflowng sentences into English.**

1. వాళ్లు వచ్చేంతలో మీటింగ్ అయిపోయింది.
2. నేను అక్కడికి వెళ్లేసరికి బుకింగ్ కౌంటర్ మూసేశారు.
3. నేనామెను పెళ్లాడాలనుకున్నాను. ( పెళ్లిఅవలేదు)
4. నేను ఓసారి యు.ఎస్. వెళ్లాలనుకున్నాను.
5. ఆరోజు ఆట పూర్తి అయ్యేటప్పటికి కపిల్ 2 వికెట్లు తీసుకొన్నాడు.
6. అతిథులు వచ్చేశారు మాలతి ఇంకావంట పూర్తి చెయ్యలేదు.
7. ఐ.టి. ఆఫీసర్లు నువ్వు ఈ డబ్బు ఎలా సంపాదించావు అని ప్రశ్నించారు.
8. పద్మ లండన్ వెళ్లక ముందు ఆమెను రెండుసార్లు చూసాను.
9. వర్షం మొదలయ్యేటప్పటికి మేము ఇల్లు చేరాము.
10. లత ఆత్మహత్య చేసుకొనేముందు లెటర్ వ్రాసింది.

**News: Information drawn from**
**N: North; E: East; W: West; S: South**
**(from all sides)**

# Lesson - 11



1. నేను హైస్కూల్లో హెడ్ మాస్టర్‌గా appoint అయినపుడు స్వరూప అసిస్టెంట్‌గా పనిచేస్తుంది.
   
   when I was appointed headmaster of the high school, Swarupa had been working as an assistant.
2. గత సెప్టెంబరు నాటికి నేను LIC లో పదేళ్ళనుంచి పనిచేస్తున్నాను.
   By last september I had been working in the LIC for ten years.
3. నేను నిన్ను కలవడం కోసం నాలుగు రోజుల్నుంచి ప్రయత్నిస్తున్నాను. అని మోహన్ శ్రియకు చెప్పాడు.
   Mohan told shriya that he had been trying to meet her for four days.
4. బాలు నలభై ఏళ్ళ నుంచి పాడున్నాడని నేను కుమార్‌కు చెప్పాను.
   I told kumar that Balu had been singing for forty years
5. గత మార్చి నాటికి నేను ఆర్నెల్ల నుంచి ఇంగ్లీషు నేర్చుకుంటున్నాను.
   By last March I had been learning English for six months.



గతంలో ఒకానొక సమయంలో - అప్పటికి కొంత కాలంగా జరుగుతున్న పనిని తెలియచెయ్యాలంటే
had been + present participle



had been playing రూపంలో verb ని ఉపయోగించాలి. ఇది past perfect continuous tense.

ఇంతక్రితం చెప్పుకున్న present perfect continuous tense లో helping verb - has/ have been అయితే ఈ tense లో Had been.

has కి have కి past tense రూపం had.

ఇప్పటికి past tense లోని నాలుగు రూపాలను చూసాం. ఇవన్నీ గతంలో జరిగిన పనులును సూచించాలంటే ఉపయోగించాల్సినవి.

1. నేను పాడాను. I sang. (simple past tense.)

subject I, II, III persons లో ఏదైనా, singular nurnber అయినా

plural number అయినా ఒకటే helping verb - did

I

we

you -

He, she, It

They



Question - Did you sing? what did you sing ?

Affirmative - I sang

Negative - I did not sing.



2. (ఆ సమయంలో) నేను పాడుతున్నాను. Past continuous tense

helping verb - was, were

ఏ Person అయినా Singular - I, He, she, It - was singing

Plural-we

You - were singing

They

Q. Were you singing?

Yes; I was singing.

No; I was not singing.

Were they singing?

Yes; they were singing.

No; they were not singing.

3. గతంలో జరిగిపోయిన రెండు పనులలో మొదటగా జరిగిపోయిన పనిని చెప్పాలంటే



డాక్టరు వచ్చేటప్పటికి పేషెంటు చనిపోయాడు.

The patient had died when the doctor arrived.



verb - had died.

b. Devadas had hoped that he would marry parvathi.

3. గతంలో ఎవరో చెప్పిన ఒక విషయాన్ని తాను ఇతరులకి చెప్పేటప్పుడు

The Finance Minister announced that the cabinet had decided not to rise petrol prices.

ఒక కథను చెప్పాలంటే లేదా ఒక సంఘటనను చెప్పాలంటే (Narration) past tense లోనే చెప్పాలి. ఆ చెప్పాల్సిన కథను తెలుగులో ఊహించుకొని వాక్యాలుగా అనుకొంటూ ఇంగ్లీషులోకి అనువదించుకొంటూ చెప్పాలి.

అడవిలో ఒక కాకి ఉంది.

There was a crow in a forest.

అది ఎండాకాలం

It was summer.

దానికి దాహం వేసింది.

It was thirsty.

నీటి కోసం చాలాసేపు తిరిగింది.

It flew for a long time for water

చివరికి అది ఒక చెట్టు మొదలు వద్ద ఒక కుండను చూసింది.

At last it found a pot at the foot of a tree.

ఆ కాకి అక్కడికి వెళ్ళి కుండలోకి తొంగి చూసింది.

The crow went there and looked into the pot.

ఆ కుండలో అడుగున నీరుంది.

It found some water at the bottom of the pot.

ఆ నీరు దాని నోటికి అందలేదు.

Its beak did not reach the water. (beak- ముక్కు)

దానికి నిరుత్సాహం కలిగింది.

It was disappointed.

అటూ ఇటూ చూసింది.

It looked around.

కొంచెం దూరంలో కొన్ని గులక రాళ్లు చూసింది.

The crow found some pebbles at a distance.

దానికొక ఆలోచన వచ్చింది.

An idea flashed into its mind.

వెంటనే అది వెళ్ళి ఒకొక్క రాయినే నెమ్మదిగా కుండలో వేసింది.

It went immediately and brought the pebbles one after another and slowly dropped into the pot.

కుండలో నీరు పైకి వచ్చింది.

The water level in the pot rose up.

కాకి నీరు తాగి ఆనందంగా ఎగిరిపోయింది.

The crow drank water and flew away

Rise - rose - risen

Raise - raised - raised.

**There is no escape from law.**
**But there is always escape through law.**

# Lesson - 12



1. నేను రేపు రాజమండ్రి వెళ్తాను.
   I shall go to Rajahrnundry tomorrow.
2. మేము వచ్చేవారం కారు కొంటాము.
   we shall buy a car next week.
3. వచ్చే పరీక్షల్లో నువ్వు మంచి మార్కులు సంపాదిస్తావు.
   You will get good marks in the coming examinations.
4. వాళ్లు వక్తృత్వ పోటీలో పాల్గొంటారు.
   They will participate in the elocution competition
5. కలెక్టరుగారు బహుమతుల నందచేస్తారు.
   The district collector will give away the prizes (to give away to distribute)



పై వాక్యాల్లో అండర్‌లైన్ చేసిన పదాలు verb లు. భవిష్యత్తులో జరుగబోయే పనులను తెలియచేస్తున్నాయి. ఇది Simple future tense.

పై వాక్యాల్లో verb లో రెండేసి పదాలున్నాయి.

సబ్జెక్టు I person - singular or plural I లేక we అయితే verb లు shall go, shall buy.



Shall -

I person, simple future tensed helping verb - shall
II person singular and plural - You
III person singular - He, she, It
III person Plural - They



వీటిల్లో ఏదయినా subject అయితే

will get, will participate, will give away

వీటిల్లో helping verb - will

గమనించాల్సిందేమంటే simple present, simple past tense లలో verb లో ఒకటే పదం ఉంది. ఆ tense ల్లో helping verb లేదు. కాని ఈ simple future tense లో రెండు పదాలు shall or will+ present tense

form of the verb కలిసి verb గా ఉంటాయి.
simple future tense mentions a future action
Now let us see how to ask questions and give replies in affirmative and negative too.

1. I shall go to Rajahmundry tomorrow.

Q. 1. When will you go to Rajahmundry?
 2. Where will you go tomorrow?
 3. Will you go to Rajahmundry tomorrow.
 Negative; No I shall not go to Rajahmundry toworrow.

2. we shall buy a car next week.
 what will you buy next week?
 when will you buy a car?
 will you buy a car next week?
 No we shall not buy a car next week.

3. you will get good marks in the coming examinations.
 shall I get good marks in the coming examinations?
 No ; you will not get good marks in the coming examinations.

4. They will participate in the elocution competition.
 who will participle in the elocution competition?
 will they participate in the elocution competition?
 No; they will not participate in the elocution competition.

5. The district collector will give away the prizes.
 who will give away the prizes?
 will the district collector give away the prizes?
 No; the district collector will not give away the prizes.

ఇంకా ఇలాంటి వాక్యాలు -

6. I shall return this book tomorrow.
 When will you return this book?
 will you return this book tomorrow?
 No; I shall not return this book tomorrow.

7. The patient will recover soon.
 when will the patient recover?
 will the patient recover soon?
 No; The patient will not recover soon.

8. She will certainly become a film star.
 What will she certainly become?

Will she certainly become a film star?
Who Will certainly become a film star?

9. Surendra will be our next P.M.
Who will be our next P.M?
Will surendra be our next PM?
No; surendra will not be our next PM?

10. We shall visit varanasi next month?
What will you visit next month?
Will you visit varanasi next month?
When will you visit varanasi?



***EXERCISE: 10***

భవిష్యత్తులో జరగబోయే ఏదైనా సంఘటన వివరించడానికి Simple Future tense ని ఉపయోగించాలి. ఉదాహరణకి కళాశాల వార్షికోత్సవం నిర్వహించాలి. ఏర్పాట్లు పూర్తి అయ్యాయి. ఆ వివరాలని నేను మా friend కి letter వ్రాయాలి.

Vegeswarapuram,
January, 13th, 2011.

Dear Prakash,

ఫిబ్రవరి 1వ తేదీ మా కాలేజీ డే (వార్షికోత్సవం)
Our college day will be on February first.
మేము చురుకుగా ఏర్పాట్లు చేస్తున్నాము.
We are actively making arrangements.
మా జిల్లా కలెక్టరు ముఖ్య అతిథిగా వస్తారు.
Our district collector will come as the chief guest.
నేను ప్రార్థనా గీతం పాడుతాను.
I shall sing the prayer song.
మా ప్రిన్సిపల్ గారు సభకి అధ్యక్షత వహిస్తారు.
The prinicipal of our college will preside over the meating.
మా విద్యార్థి సంఘాధ్యక్షుడు వార్షిక నివేదిక సమర్పిస్తాడు.
The president of our student’s union will present the annual report.
కార్యదర్శి అతిథులను పరిచయం చేస్తాడు.
The secretary will introduce the guests.
కలెక్టరు గారు విద్యార్థులనుద్దేశించి ప్రసంగిస్తారు.

The district collector will address the students.

కలెక్టరు గారి భార్య బహుమతులను అందచేస్తారు.

The wife of the collector will give away the prizes.

కార్యక్రమం చివర మేం జాతీయ గీతం ఆలపిస్తాము.

we shall sing the national anthem in the end.



address on the envelope.

To
Mr. Prakash
Jangareddigudem,
W.G.Dt.



Yours lovingly,
A.S. Narayana.

**Knowledge murmours but money roars**

# Lesson- 13

1. వచ్చే సంవత్సరం ఈ పాటికి నేను బిటెక్ చదువుతూంటాను.
   I shall be studying B,Tech next year by now.
2. రేపు పన్నెండింటికి మేము లంచ్ చేస్తుంటాము.
   We shall be having lunch by 12.00 noon tomorrow.
3. వీరేంద్ర నవల వచ్చే నవంబరులో స్వాతిలో సీరియల్‌గా ప్రచురితమవుతూంటుంది.
   Virender's novel will be publishing in swathi serially from the coming November.
4. ఆర్థిక మంత్రి ఫిబ్రవరి 28 నుంచి పార్లమెంటులో బడ్జెటు ప్రవేశపెడుతుంటారు.
   The finance minister will be presenting the budget to the Lok sabha on Feb 28th.
5. The winter session of the parliament will be going on next month by now.

పై వాక్యాల్లో verb ల్లో మూడేసి పదాలున్నాయి.
shall be studying, will be publishing etc.
ఇంత క్రితం లాగనే I person singular or plural - shall be + present participle form of the verb.
II and III person - singular or plural - will be + present participle.
దీన్ని Future continuous tense అంటారు.
The Future continuous representes an action as going on at some point of time in future.
Will be + presenting, will be -- helping verb.
present - prinicipal verb.
Presenting - Present Participle form
ఈ tense లో questions అడగాలంటే
1. I shall be studying B.Tech next year in Chennai.

Where will you be studying B.Tech next year. ? .

Will you be studying B.Tech in channai next year ?

2. We shall be celebrating Diwali in the U.S. next year.

Q. Where will you be celebrating Diwali next year?

3. He will be acting in a film next month.(by 2nd weak)

4. The cricket match between India and Pakistan will be going on tomorrow by 10a.m.

5. Mr. B.S.N. Murthy will be completing thirty years of service by May this year.



పైన వ్రాసినట్లుగా ప్రతి వాక్యానికి by అని నిత్యవ్యవహారంలో ఉపయోగించం. సందర్భాన్ని బట్టి మాట్లాడుకునే ఇద్దరికీ అర్థం అయిపోతుంది. ఉదాహరణకి ఈ సంభాషణ చూడండి.

Ramu - I shall leave for Delhi tomorrow by A P express

Raja - Then Latha will be writing her examinations.

**Good bye - Shortened from of God be with you**

# Lesson 14



1. వచ్చే ఏడాదికి ఈ బ్రిడ్జి నిర్మాణం పూర్తి అవుతుంది.
   The bridge Will have completed by next year.
2. రేపు ఈ పాటికి ఈ పుస్తకం చదివేస్తాను.
   I shall have read this book by this time tomorrow.
3. వాళ్లు వచ్చేనెలకి లా కోర్సు పూర్తిచేస్తారు.
   They will have completed the law course by next month.
4. సుబ్బారావు రేపు 8 గంటలకు పెళ్లిచేసుకుంటాడు.
   Mr Subbarao will have married by 8 o clock tomorrow
5. వాసంతి ఇంగ్లీషు కోర్సు రేపటికి పూర్తి అవుతుంది.
   Vasanthi will have completed English course by tomorrow

   భవిష్యత్తులో ఒకానొక టైముకి ఒక పని పూర్తి అవుతుందని చెప్పాలంటే verb రూపం ఇలా ఉంటుంది.

   ఈ tense లో verb లో మూడు పదాలుంటాయి.

   will / shall + have + past participle

   will / shall ఉంది కనుక future

   have ఉంది కనుక perfect (ఈ tense లో has రాదు)

   have తరువాత ఎప్పుడూ past participle form of the verb వస్తుంది.

   ఇది future perfect tense

   The future perfect marks a future action as already comp leted before.



6. నువ్వు ఇప్పుడు బయలుదేరితే చీకటి పడక ముందే ఇల్లు చేరుతావు.
   If you start now, you will have reached home before it gets dark.
7. రఘు యూ.ఎస్. నుంచి వచ్చేటప్పటికి వాళ్లనాన్న చనిపోతాడు.
   His father will have died before Raghu comes from the us.

8. మాధవి వాళ్ళింటికి వెళ్ళేటప్పటికి వాళ్ళ భోజనాలు అయిపోతాయి.
   They will have had their lunch by the time Madhavi reaches their house.
9. రేపు 10 కి నేను జాయినింగ్ రిపోర్టు సమర్పిస్తాను.
   I shall have submitted my joining report by 10 am tomorrow.
10. ఎల్లుండి రాత్రికి 10 గంటలకి మేము కాశీకి చేరుకొంటాము.
   We shall have reached kasi by 10 p.m. day after tomorrow.

**Success has many fathers**

**but failure is an orphan**

# Lesson 15



1. నువ్వు లండన్ నుంచి తిరిగొచ్చేటప్పటికి ఫైనల్ ఇయిర్ చదువుతూంటాను.

By the time you return from London, I shall have been study ing final year.



2. నువ్వు షాపింగ్ చేసి వచ్చేటప్పటికి నేను రెండు గంటలుగా నిద్రపోతుంటాను.

I shall have been sleeping for two hours by the time you return from shopping.

భవిష్యత్తులో ఒకానొక సమయానికి జరుగుతున్న ఒక పనిని తెలియచేయాలంటే ఈ tense ను ఉపయోగించాలి. ఇది future perfect continuous tense.

Shall / will - future

have perfect (ఈ tense లో has నుపయోగించరు.)

been - be form

present participle - continuous

ఈ verb form లో been కి రెండు ఉపయోగాలు.



have తరువాత verb యొక్క past participle form ఉండాలి.

be యొక్క past participle been (be - was - been)

continuous tense లో present participle కి వెనుక helping verb గా be form ఉండాలి. అది ఈ tense లో been.



ఈ tense లో shall / will have been - helping verb

present, past, future

మూడు టెన్స్‌ల్లోనూ perfect కి perfect continuous కి ఒకటే సంబంధం. ఆ సమయానికి పూర్తి అయిపోయిన లేదా ఆ క్షణం వరకూ లేదా ఆ క్షణంలో కూడా జరుగుతున్న పనికి perfect tense. ఆ పని అటు పైన కూడా కొనసాగుతున్నపుడైతే perfect continous tense ని ఉపయోగించాలి.

present perfect - He has written the novel.

He has written the novel for two yers.

( వ్రాయడం ఇప్పుడేనో - కొంచెంసేపు క్రితమో పూర్తి అయిపోతుంది. ఇక ముందు మాత్రం కొనసాగదు.)

Present perfect continuous - He has been writing the novel for two years. (రెండేళ్ళ నుంచి వ్రాస్తున్నాడు. ఇక ముందు కూడా వ్రాస్తాడు.)

Past perfect లో He had written the novel when I met him.( వాడు నవల పూర్తి చెయ్యడం, నేను వాణ్ణి కలవడం - రెండూ జరిగిపోయిన పనులే)

Past perfect continuous లో

He had been writing the novel when I met him.

గతంలో ఒకానొక సమయానికి (నేను అతడిని కలిసినప్పటికి) అప్పటికి జరుగుతున్న పని.

Future perfect లో He will have written the novel b tomorrow.

భవిష్యత్తులో ఒకానొక సమయానికి (tomorrow) పూర్తి అవ్వబోయే పనిని తెలియచేసేది.

Future perfect conttnuous - అంటే భవిష్యత్తులో ఒకానొక సమయానికి పూర్తి కాలేదు. ఇంకా కొనసాగే పని.

He will have been writing the novel by tomorrow.

3. స్వరూప రేపీపాటికి నవల చదువుతూంటుంది.
   Swaroopa will have been reading the novel by tomorrow.
4. సబ్బారావు రేపు 8గం॥లకి పెళ్ళి చేసుకొంటూంటాడు.
   Mr. subba rao will have been marrying by 8 am. tomorrow.
5. నువ్విప్పుడు బయలు దేరితే, చీకటి పడేసరికి ఇంటికి వెళ్తుంటావు.
   If you start now, you will have been going home when it gets dark.
6. మాధవి వాళ్ళింటికి వెళ్ళేటప్పటికి వాళ్ళు భోజనాలు చేస్తూంటారు.
   They will have been having lunch when Madhavi. reaches their house.
7. రేపు పదింటికి నేను జాయినింగ్ రిపోర్టు సమర్పిస్తూంటాను.
   I shall have been submitting my joining report by 10 am. tomorrow.

***EXERCISE:11***

Present, Past, Future tense లు మూడింటిలో ఒక్కొక్క దానిలో నాలుగు చొప్పున మొత్తం 12 tense ల రూపాలు. వాటి ఉపయోగాలు తెలిసాయి. ఇప్పుడు ఈ tense లు అన్నీ ఉపయోగించే విధంగా 'నేను' అనే అంశం మీద ఓ paragraph ని వ్రాయాలి.



1. నా పేరు చిన్మయ.
2. మానాన్నగారు పేరు రామదాసు.
3. నాకు ఒక అన్నయ్య ఉన్నాడు.



4. నేను గవర్నమెంటు హైస్కూల్‌లో టెన్త్ క్లాసు చదివాను.
5. నేను టెన్త్ ఫస్ట్ క్లాసులో పాసయ్యాను.
6. నాకు 540 మార్కులు వచ్చాయి.
7. నేను ఇంటరు చదువుతున్నాను.
8. నేను టెన్త్ పాసయిన నాటికి మా అన్నయ్య బిటెక్ చదువుతున్నాడు.
9. మా అన్నయ్య నాకు మాథ్స్ చెప్పేడు.
10. మా అన్నయ్యకు మాథ్స్ అంటే ఇష్టం.
11. నాకు మెడిసిన్ చదవాలని ఉంది.
12. వచ్చే ఏప్రియల్‌తో నా ఇంటర్ చదువు పూర్తి అవుతుంది.
13. నేను ఇంటర్ పాసయ్యే నాటికి మా అన్నయ్య మూడు నెలలుగా చెన్నైలో ఉంటుంటున్నాడు.



14. క్రితం సంవత్సరం మే ఇల్లు కట్టుకున్నాము.
15. ఇంటి మీద లోన్ 2015 నాటికి తీరిపోతుంది.
16. నేను, రమేశ్ మంచి స్నేహితులం (I and Ramesh అనకూడదు. Ramesh and I అనాలి.)



17. సౌజన్య మనసు గెలవడానికి రెండేళ్ల నుంచి ప్రయత్నిస్తున్నానని రమేశ్ నాతో అన్నాడు.
18. నాకు టెన్త్ క్లాసులో ఫస్ట్ ర్యాంక్ వస్తుందనుకున్నాను.

**Man is born free, but he is every where in chains**

# Lesson - 16

Can-Could

1. నేను ఇంగ్లీషులో మాట్లాడగలను.
   I can speak in English. (I am able to speak in English)
2. లత వయోలిన్ వాయించగలదు.
   Latha can play on the violine.
3. పాక్ సైన్యం భారత సైన్యంతో తూగలేదు.
   Pak army can not match with the Indian army.
4. మనము నిరక్షరాస్యత నిర్మూలించగలము.
   We can eradicate illiteracy
5. అతడు సులువుగా రమేశ్‌ను ఓడించగలడు.
   He can easily defeat Ranesh.
   ఈ వాక్యాల్లో Can expresses ability
6. నేను లోపలికి రావచ్చండి?
   Can I come in sir?
7. మిమ్మల్ని ఒక ప్రశ్న అడగవచ్చా?
   Can I ask you a question?
3. నువ్వు ఇక వెళ్లవచ్చు.
   You can go now.

ఈ మూడు వాక్యాల్లోను Can కి అర్థం may

May I come in sir?
May I ask you a question?
You may go now.

permission అడగడం గాని ఇవ్వడం గాని అర్థం. కాని can కంటే may ఉపయోగించడం మంచిది.

4. పసిపిల్లగా ఉన్నపుడే ఆమె బాగా పాడగలిగింది.
   Even as a child she could sing well.
5. వాడు చెయగలిగిందంతా చేసేడు.
   He did all that he could do.

6. నిన్న లంచ్‌కి నువ్వు ఎందుకురాలేక పోయావు?

Why couldn't you attend lunch yesterday?

can కి past tense could. పై రెండు వాక్యాలు గతంలో ఒక వ్యక్తి abiltily ని చెబుతున్నాయి. మరి future tense లో ఈ భావాన్ని చెప్పాలంటే can ఉపయోగపడదు. will / shall be able to అని చెప్పాలి.

we shall be able to defeat them

They will be able to complete the work by tomorrow.

8. మిమ్మల్ని ఒక ప్రశ్న అడగవచ్చా?

Could I ask you a question

9. దయచేసి మీ అడ్రసు ఈ పాడ్ మీద వ్రాయరా?

Could your write you address on the pad?

ఈ ప్రశ్నలో could - past tense ని సూచించదు. వీటిలో could కి బదులు can ని ఉపయోగించినా grammar తప్పుకాదు. కాని భావం తప్పు.

could - మర్యాద సూచిస్తుంది.

10. Batsman బంతిని కొట్టాడు.

అబ్బ. ఏం shot! అది సిక్స్ కావచ్చు. ఓహ్ ... అది సిక్స్

Oh! what a shot! It could be a six!.. yes ! it is!

11. నువ్వు కష్టబడి వుంటే నీవు ఫస్ట్‌క్లాస్ పొందగలవు.

If you worked hard, you could get first class.

ఈ రెండు వాక్యాలలోనూ could - past tense కాదు. Persent tense లోనే passibility (సంభావ్యత) తెలియచేస్తుంది. అవ్వచ్చు అంటే కాకపోవచ్చు అనికూడా అర్థం. కాని ఈ ప్రయోగాల్లో దాదాపుగా అవుతుందనే అర్థం ఉంది. spoken English లో could యొక్క ప్రయోగంచాలా విశిష్టమైనది. అందమైనది.

can -could

may - might

shall - should

will - would

must - must, dare - dared, need - needed

**May - Might**

1. నేను ఇంటికి వెళ్ళవచ్చా?
May I go home?
Affirmative :- yes, you may.
negative :- no; you may not
negative మాత్రం - may కి బదులు can వాడకం కూడా ఉంది.
No; you can not! అన్నట్లు. ఇక్కడ may permission అర్థం ఇస్తోంది.
2. ఆవిడ ఈ ప్రతిపాదనకి అంగీకరించవచ్చు.
She may agree to this propoal.
3. ఈ ఏడు పంట దిగుబడి బాగుండవచ్చు.
we may have good havrest this year.
4. అతడి ఆత్మకి శాంతి కలుగుగాక.
May his soul rest in peace.
5. నువ్వు అన్ని ప్రయత్నాల్లో అభివృద్ధి చెందుదువుగాక.
May you prosper in all that you try.
ఈ వాక్యాలలో may expersses wish (ఆకాంక్ష)
6. మంచి మార్కులు పొందేందుకు బాగా చదువు.
Study well so that you may get good marks.
7. బ్రతకడానికి తిను. తినడానికి బ్రతక్కు.
Eat that you may live, don't live that you may eat.
so that, that లతో 'ప్రయోజనం కోసం' చెప్పేందుకు may ని ఉపయోగించాము.
It may rain today.
It may rain tomorrow.
May conjugation లో మూడో రూపం (past participle ) లేదు.
May - might రెండే రూపాలు.
may ని present, future tense ల్లోనూ
might ని present past, future tense ల్లోనూ ఉపయోగించవచ్చు.
He may come now
He might be at the bus stand now.
He may arrive tomorrow.
He might join B.Tech next year.
May కి past tense రూపం might.

8. He told me that he might go abroad soon.
9. Gayatri expressed that she might come for pongal.
ఇవి Indirect speach లో వాక్యాలు. main clause (That కి వెనక భాగం) లో past tense ఉంటే subordinate clause (that తరువాత భాగం) లో past tense లో గానీ past perfect tense లో గానీ ఉంటుంది.

Might ని past tense రూపంగా కాక present tense లోనే doubt ని చెప్పేందుకు ఉపయోగిస్తారు. may ని కూడా ఉపయోగిస్తారు. కానీ may ని ఉపయోగించిన సందర్భంలో కంటే might ని ఉపయోగించినపుడు ఎక్కువ అనుమానం వ్యక్తం అవుతుంది.

10. I may pass. నేను పాస్ అవ్వచ్చు.
I might pass అంటే pass విషయంలో ఎక్కువ అనుమానం ఉన్నట్లు. (ఆశ తక్కువ)
రెండూ present tense లో ఉపయోగించేవే.
The patient may recover. వాక్యంలో కంటే.
11. The patient might recover లో recovery కి ఆశ తక్కువ.
మనం చాలా పెద్ద వాళ్ళతో మాట్లాడేడప్పుడు వినయం, మర్యాద వ్యక్త అయ్యే విధంగా
If I might make a sugestion, couldn't we try once more?
నువ్వు ఇంత క్రితమే నాకు చెప్పిఉండాల్సింది.
You should have told me before అని నిర్మోహమాటంగా చెప్పవచ్చు.

You might have told me before. అని చాలా సున్నితంగా చెప్పవచ్చు.
ఇంకో రకంగా you ought to have told me before. ఇది నీ బాధ్యత అన్నట్లుగా చెప్పవచ్చు.

ought బాధ్యత (obligation) ని చెపుతుంది. (దీని వివరం ముందు...)

**Shall - Should**

12. ఈ పుస్తకం రేపు తిరిగిఇచ్చేస్తాను.
I shall return this book tomorrow.
మేం వచ్చే ఆదివారం పిక్నిక్ వెళ్తాము.
we shall go on a picnic net sunday.
ఈ రెండు సందర్భాలలోనూ shall future tense లో helping verb
నువ్వు నేను చెప్పినట్లు వినాలి.

You shall obey me. .

shall కి సహజమైన స్వంత అర్థంలో You will be obliged to obey me

నిశ్చయంగా నువ్వు నేను చెప్పినట్లు వినాలి.

13. I person (I, We) subject future tensee5 helping
verb - shall
II and III person shall

a) You shall obey me
b) Thou shall not steal
c) You shall be given an award

d) He shall be promoted to a gazetted post.
e) You shall apologize

నువ్వు క్షమాపణ చెప్పుకోవలసి వస్తుంది జాగ్రత్త. (హెచ్చరిక)

f) They shall pay for this.

వాళ్ళు దీనికి మూల్యం చెల్లించుకోవలసినందే

g) ప్రతీదీ చట్ట ప్రకారం జరగాల్సిందే.

Everything shall be done according to Law.

shall కి past tense form - should

14) I told her that I should meet her the next day.

shall ని I person future tense లో auxilliary verb గా వాడుతాం.

కానీ should ని I,II,III, persons లోనూ duty or obligation సూచించే

విధంగానూ ఉపయోగిస్తాం.

a) I should not be disloyal to my master.
b) We should have helped him in crisis.
c) you should join hands with others for common good.

d) He should reveal the truth at least now.
e) They should have paid the tax in time.

15. వాడొస్తే wait చెయ్యమని చెప్పు - అనాలంటే

If he comes, ask him to wait అనవచ్చు. కానీ

should he come, ask him to wait అని గానీ

If he should come ask him to wait అని గానీ అనవచ్చు. కానీ

should ఉపయోగిస్తే వాడొచ్చే possibility తక్కువ అని భావం.

16) should ని auxilliary గా తప్పనిసరిగా ఉపయోగించాల్సిన

సందర్భం -

టీచర్ వాణ్ణి తీవ్రంగా punish చేసేడు లేకపోతే వాడు తప్పు దారిపడతాడు.
The teacher punished the boy severely lest he should go astray.
lest = లేకపోతే
lest ఉపయోగించినపుడు should మాత్రమే ఉపయోగించాలి.
watch and pray lest you should fall into temptation

నేరస్థుడు తప్పించుకుంటాడని పోలీసులు ఆ ఇంటిని చుట్టు ముట్టారు.
The police surrounded the house lest the criminal should escape
**Will - Would:**

17) Will కి past tense form "would"
ఈ అర్థంలో Indirect speach లో
The manger told me That the office would be closed on Friday.
She said that she would not wait there any more.
గతంలో అలవాటుగా జరిగే పని-
రాత్రి భోజనం అయ్యాక విద్యార్థులు common room లో కూర్చుని కాసేపు కబుర్లాడుకుంటారు.
After dinner, the boys would sit in the common room and chat for a while.
నేనో మూల నిద్రపోతుండేవాడిని.
I would sleep in a corner.
18) **would, would like to**

1 would know what my duty is
I would like to know what my duty is

ఇతరులు నీ పట్ల ఎలా ప్రవర్తించాలనుకుంటావో నీవు ఇతరుల పట్ల అలా ప్రవర్తించు.


Behave towards others as you would like them to behave towards you.
19. <u>would rather</u> expresses choice or preference.
I would rather die than marry her.
She would rather read a novel than to see that picture.
They would rather go to jail than to pay the fine.
20. Would is used to ask polite questions.
Will you have a cup of coffee?
would you have a cup of coffee? (polite)

21. అసంభవం, అసంభావ్యములను వ్యక్తం చేసేటప్పుడు - ఉదాహరణకి నేనే రాజునైతే నిన్ను నా మంత్రిగా చేసేవాణ్ణి
If I were the king. I would make you my minister.
I తరువాత were ని ఉపయోగించడమే అసంభావ్యతని సూచిస్తుంది.
నేనే నువ్వయితే (నీ స్థానంలో నేనుంటే - అని) ఇది అసంభావ్యమే కదా!



**Must:**

Present, Past, Future - మూడు tense లలోనూ, subject యొక్క number, (singular or plural) person (I, II లు) అన్నింటిలోనూ must కి వేరే రూపంలేదు. అన్ని సందర్భాలలోనూ must నే ఉపయోగించవచ్చు.



Present tense లో - I must thank you for your help.
Future tense లో - you must give a police complaint.
ఆ రెండు tense ల్లోను must తరువాత present tense form of the verb (Thank, give) వచ్చాయి.
past tense లో మాత్రం must తరువాత present perfect tense form of the verb ను ఉపయోగించాలి.
You must <u>have attended</u> the funtion.
must ప్రయోగాలు :
1. మేనేజ్‌మెంట్ వారు worker ల హక్కులను గుర్తించాలి. (గుర్తించితీరాలి)
The management must recognise the rights of the workers
దీనిలో must కి బదులు should ప్రయోగిస్తే



The mangement should recognise the rights of the workers
ఇది కరెక్టే. కానీ shold ప్రయోగం కంటే must ప్రయోగం force ఎక్కువ.
we must be loyal to our country.



2.సంభావ్యత - probability - అంటే - అయిఉండవచ్చు. దీనికంటే -అయి ఉండాలి లో force ఎక్కువ. ఈ అర్థంలో must ను ఉపయోగించాలి. ఆ proposal ని ఒప్పుకుంటే వాడు పిచ్చివాడై ఉండాలి.
He must be mad to agree to the proposal
తలుపు చప్పుడైంది. పాలవాడై ఉండాలి.
There is a knock on the door. That must be the milk vendor.
3. ప్రశ్న అడగాలంటే Must ని ముందు ఉపయోగించాలి.
Must you apply causual leave?

**Ought:**

దీని తరువాత to ఆ తరువాత verb (present tense form) వస్తాయి.

ought to go అన్నట్లు

to తరువాత present tense form of the verb తో కలిపి to go ని

to - infinitive అంటారు. to go - ఇది verb కాదు.

ought కూడా must లానే present, future tense లలో ఈ రూపంలో

ఉంటుంది. past tense లో మాత్రం ought తరువాత present perfect tense

form of the verb ను ఉపయోగించాలి.

ought indicates obligation. Must కి ఉన్నంత force లేదు. should

కంటే ఘాటైనదే.

1. ముసలి తల్లి దండ్రులను కనిపెట్టుకొని ఉండాలి.
   we ought to look after the old parents
2. ధనవంతులు పేదలకు సహాయం చేయ్యాలి.
   The rich ought to help the poor
3. దాని మీద అంతటైము వేస్ట్ చెయ్యకూడదు.
   we ought not to have wasted so much time over it
4. మనం చెయ్యవలసిన పని చేసాము.
   we have done the work which we ought to have done.

**Need**

దీన్ని prinicipal verb గానూ auxlilliary verb గానూ కూడా

ఉపయోగిస్తారు.

prinicipal verb గా need కి అర్థం to require.

1. అతడికి నీ సాయం అవసరం.

He needs your help

(He requires your help అని అర్థం)

Question: Does he need your help?

2. మనకేది అవసరమో అది వచ్చింది.

we have got what we need.

Q. Have you got what you need?

ఈ వాక్యాల్లో need దాని స్వంత అర్థం require or to be under

the necessity to do something లోనే ఉంది.

ఇక need ని auxilliary గా ప్రయోగిస్తే

subject I, II, Ill persons, singular or plural nurnber లో present tense లో need గానే ఉంటుంది.
Future tense లేదు.
Need తరువాత present perfect form ఉపయోగిస్తే past tense అవుతుంది.

He need not go.
Question: Need he go?
Need ని సాధారణంగా not తోనే ఉపయోగిస్తారు.

He need not ask any permisssion.
They. need not write any longer.
You need not mention this to any one else.
need ని question లో ఉపయోగిస్తే not ని ప్రయోగించరు.
Need he wait any longer?
Need I come again?
Need you my help?
Past tense లో need తర్వాత present perfect tense form of the prinicipal verb ని ఉపయోగించాలి.
He need not have lost his temper
They need not come all the way
we need not have waited for his arrival.

ఇక్కడొక సూక్ష్మాన్ని చెప్పాలి. Question చెప్పేటప్పుడు need ని ఉపయోగించాలి.
Need he wait any longer?
Need they pay anything?

Answer లో negative చెప్పాలంటే no - need not ఉపయోగించాలి.
Question : Need they pay anything?
No, they need not pay anything?
కానీ జవాబు postive అయితే need కి బదులు must ను ఉపయోగించాలి.
Need they pay anything?
Yes they must pay something.

**Dare ప్రయోగం:**

Dare is used both as a priniciple verb and an auxiliary. As a

prinicipal verb, dare means defy, challenge.

1. ఆ పని చెయ్యమని నిన్ను ఛాలెంజ్ చేస్తున్నాడు.
   He dares you to do it.
2. రవి ఏ పనికి జంకడు.
   There is nothing that Ravi does not dare.
3. నా ఎదుట నిలబడడానికి మధు సాహసించడు.
   Madhu does not dare to stand in front of me
4. How dare he talk so rudely.
5. Dare he say I am a liar?



Dare ని helping verb గా ఉపయోగిస్తే

1. He dare not jump into the river.

ఇదే వాక్యంలో prinicipal verb గా

He does not dare to jump into the river.

Questions : -

Dare he jump into the river ? (1వ వాక్యానికి question)

Does he dare to jump into the river? (2 వ వాక్యానికి ప్రశ్న )

Dare ని prinicipal verb గా ఉపయోగిస్తే He, She, It తరువాత dares ను ఉపయోగించాలి. AuxiIliary గా ఉపయోగిస్తే dare గానే ఉపయోగించాలి.

**<u>used to:</u>**

‘use’ ని principal verb గా ‘ఉపయోగించు’ అనే అర్థంలో వాడుతాం

1. I used your pencil.
   Question: Did you use my pencil?
2. She uses oxford dictionary.
   Question: Which dictionary does she use?
2. Does she use oxford dictionary?
3. Past tense used ని యూజ్‌డ్ అని చదువుతాం.



Helping verb used కి ఈ use తో సంబంధం లేదు.

Used to ని యూస్ట్ youst అని చదవాలి.

దీన్ని past tense లోనే ఉపయోగించాలి.

దీన్ని గతంలో ఒక అలవాటు - habit in the past సూచించడానికి

సాంప్రదాయం లేక ఆచారం Custom in the past సూచించడానికి ఉపయోగిస్తారు.

1. I used to smoke before I had heart trouble.
question: used you to smoke before you had heart trouble?
2. He used to Swim across the river when he was young.
Used he to swim across the river when he was young?
3. Cinema music is not so sweet as it used to be
4. There used to be a library where the liquor shop exists now.
5. The U.S. returned doctor is slowly getting used to these roads.

మరికొన్ని ప్రయోగాలు :

**have to:**

1. నేను పుస్తకం తిరిగి ఇచ్చెయ్యాలి.
I have to return this book (must)
2. He has to attend the meeting. (responsibilty)
He needs to attend the meeting. (necessity)
He ought to attend the meeting.(obligation)
Question: Need he attend the meeting?
Negative - No, he need not.
Affinmative - yes; he must (ఈ తేడాని గుర్తుంచుకోవాలి.)
I had an accident (had - prinicipal verb)
Had i an accident? (not correct)
No i hadn't an accident.(worng)
Did you have an accident? (correct)
No; I did not have an accident.(correct)
We had a meeting yesterday.
We had not a meeting yesterday- wrong
We did not have a meeting yesterday - corretct.
She has fever.
Does she have fever?
She hasn't fever. - wrong
She does not have fever, correct.

**Beggars are not choosers**

# Lesson - 17

సంస్కృతంలో 'అనుగృహీతోస్మి' అంటే అనుగ్రహింపడినవాడను. అంటే తమ అనుగ్రహం పొందాను అని అర్థం. కానీ సంస్కృతంలో అనుగ్రహింపబడిన వాడను అనడం వాడుక.

అలాగే హిందీలో సమాచార్ సునాయే జా రహే హై వార్తలు వినిపించ బడుతున్నాయి. అంటే మీరు వార్తలు వింటున్నారు అని అర్థం. కానీ హిందీలో వార్తలు వినిపించబడుతున్నాయి అనడమే పరిపాటి.

కానీ తెలుగులో నీకు పుస్తకం ఇవ్వబడిందా? అని అడగం. నీకు పుస్తకం ఇచ్చానా? అనే అడుగుతాం. ఇది తెలుగు భాష స్వభావం.

హిందీ, సంస్కృతం భాషలకు ఒకే వాక్యనిర్మాణ పద్ధతులు ఉన్నాయి. తెలుగులో "బడు" ప్రయోగం సహజం కాదు.

వినబడింది - కనబడింది. ఇలాంటి అరుదైన ప్రయోగాలు కొన్ని ఉన్నాయి. కాని ఇవ్వబడింది. చంపబడ్డాడు అనడం తెలుగులో అసహజం. ఆర్థిక మంత్రి పార్లమెంటులో బడ్జెట్ సమర్పించారు అని చెప్పాలంటే
The Finance minister presented the budget to the parliament
అని చెప్పవచ్చు.
The budget was persented in the parliament అనడం మంచి ప్రయోగం.
తెలుగులో రాముడు రావణుని చంపాడు అంటాం. కానీ రావణుడు రామునిచే చంపబడ్డాడు అని చెప్పం.
రామునిచే చంపబడ్డాడు అని చెప్పడం పద్ధతి కాదు కానీ ఇంగ్లీషులో
Rama killed Ravana అనవచ్చు. కానీ
Ravana was killed by Rama అనడం వాడుక.
ఈ పద్ధతిలో వాక్యవిన్యాసాలు చూద్దాం.
1. ఈ పాట బాలు చేత పాడబడింది.
This song is sung by Balu
(sing - sang - sung) ఈ వాక్యాలన్నింటిలో verb యొక్క past participle form మాత్రమే వస్తుందని గుర్తించండి.
ఈ వాక్యం ఏ tense లో ఉంది అనేది sung వెనుక ఉన్న be form వల్ల

గుర్తించాలి.

ఈ వాక్యంలో beform - is

కనుక verb - present tense అని గుర్తిస్తాం ఇంకా

The song - singular number కనుక beform - is ను ప్రయోగించాం.

ఈ విధంగా object తో మొదలు పెట్టి be - form + past participle ను verb గా చేసి by + subject రూపంలో వాక్యాన్ని passive voice లో ఉంది అంటాము.

2. రామాలయం రామదాసుచే నిర్మించబడినది.

The Ram temple was built by Ramadas.

Build - Built - Built.

be form - past tense కనుక ఈ వాక్యం past tense లో ఉంది. ఈ వాక్య విధనంలో object వాక్యం ప్రారంభంలో ఉండి, చేసినవారు subject) వాక్యం చివర ఉంటుంది. ఆ subject ముందు by ఉంటుంది.

3. పాకిస్తాన్ భారత్ చేత ఓడించబడింది.

Pak was defeated by India.

3. ఈ రోజు ఇంటర్ రిజల్ట్స్ ప్రకటిస్తున్నారు.

The Intermediate results are announced today.

4. రాజు రోజూ హిందూ పేపరు చదువుతాడు.

The Hindu is read (రెడ్) by Raju everyday.

5. నాని అసెంబ్లీకి ఎన్నుకోబడ్డాడు.

Nani was elected to the assembly.

6. గాయత్రి ఇంగ్లీషు నేర్చుకొంటోంది.

English is being learnt by Gayatri.

ఈ వాక్యాన్నే ఇంకోలా వ్రాస్తే

Gayatri is learning English.

present continuous tense లో ఉంది.

కనుక is - be form - present tense

being - continuous tense ఈ రెండూ కలిసొచ్చేలా

English is being learnt by Gayatri

7. Andhra pradesh is being ruled over by the congress

present continuous tense లో ఉంది.

ఇలా మనం ఇంత క్రితం చూసిన 12 tense forms లో

1. present perfect continuous
2. past perfect continuous
3. Future continuous
4. Future perfect continuous
ఈ నాలుగు తప్పమిగిలిన ఎనిమిది Tenes లకే passive voice forms ఉంటాయి.

The circus manger trapped the tiger.
ఇది active voice లో వాక్యం.
The tiger was trapped by the circus manger.

ఇది passive voice లో వాక్యం.
Active voice లో వాక్యాన్ని passive voice లోకి మార్చే విధానం విద్యార్థులకి పరీక్షలో change the voice అనే ప్రశ్నకి జవాబు వ్రాయడానికి ఉపయోగపడుతుంది.
కానీ ఇంగ్లీషు నేర్చుకునే వాళ్ళకీ పద్ధతి ఉపయోగ పడదు.
passive voice లో వాక్యనిర్మాణాన్ని practice చెయ్యాలి.
8. ప్రతీ ఆదివారం వాళ్ళింట్లో మాంసాహార వంటకాలు తయారుచేయబడతాయి.
Non - vegetarian dishes are prepared in their house every sunday.
9. ఈ దేవాలయం ప్రతిరోజు మైత్రేయి చేత దర్శించబడుతుంది.
This temple is visited by Mythryi every day.

10. ఆమె చేత పువ్వులు అమ్మబడుతున్నాయి.
Flowers are being sold by her.
11. ఆ పాము ఇప్పుడే చంపబడినది.

The snake has been killed just now.
ఇది present perfect tense లో passive voice వాక్యం.
present perfect tense లో helping verb - has
be form ----- been
have -has - had తరువాత verb యొక్క past participle form ఉండాలి.
కనుక be కి conjugation - be - was - been లో past participle been ఉంది.
passive voice లో be - form తరువాత past participle form of the prinicipal verb - killed (kill - killed - killed) ఉండాలి.

12. The snake has been killed just now.
ఎవరు చంపారో స్పష్టంగా తెలియకపోతే by + Subject లేదు.
13. రామయ్యను ఉద్యోగంనుంచి డిస్మిస్ చేసారు.
Ramayya has been dismissed from service
14. పసివాడు ప్రవాహంలోకి లాగి వేయబడ్డాడు.
The child has been dragged into the stream

ఇవి simple present, present continuous, present perfect లలో ఉదాహరణలు.

present perfect continuous tense లో passive voice లేదు.
15. నెపోలియన్ వాటర్లూ యుద్ధంలో ఓడించబడ్డాడు.
Nepolean was defeated in the battle of waterloo.
16. నేను 1949 లో పుట్టాను.
I was born in 1949.
Bear - bore - born.
Bear = to bring forth.
కౌసల్య రాముని కన్నది.
kousalya bore Rama. (Bore - past tense.)
ఈ వాక్యంలో bore కి part participle - borne
Kousalya has borne Rama
17. మహాత్మ గాంధీ పోర్‌బందర్‌లో జన్మించాడు.
Mahathma Gandhi was born in porbandar.

18. కాళిదాసు చేత మూడు నాటకాలు వ్రాయబడ్డాయి.
Three plays were written by kalidasa.
Three plays plural number.

past tense be form were
past participle form of write - written (Write - Wrote - Written)
19. పాండవులు జూదంలో మోసగించబడ్డారు.
The pandavas were cheated in the game of dice.
20. పాటలు వినబడుతున్నాయి.
Songs were being heard.(at some time in the past)
ఇది past continuous tense. ‘songs’ plural number
past tense and plural number లో be form - were
ఇది continuous tense కనుక being వాడాలి.

hear - heard - heard అంటే verb కి past participle form heard

21. కాంగ్రెసు స్థాపన నాటికి బ్రిటిష్ వారు ఇండియాను పాలిస్తున్నారు.
India was being. ruled over by the British when the congress was founded.

ఈ వాక్యంలో subject-India

ఇది 3rd person singular past tense లో be - form - was
continuous tense - being
past participle form of the verb - ruled (rule - ruled - ruled)

22. అప్పుడు ఆ భవనాన్ని కూలగొడుతున్నారు.
Then the building was being demolished.

23. పోలీసు అక్కడికి చేరుకొనే సరికి అతణ్ణి చంపేసారు.
He had been killed when the police reached there
past perfect tense లో helping verb - had
been - be - form killed - past participle form of the verb - kill.

24. వాన మొదలయ్యే సరికి ఆట పూర్తి అయిపోతుంది.
The match had been finished when the rain began.

25. రామ లక్ష్మణులు పర్ణశాలకు తిరిగి వచ్చే సరికి రావణుడు సీతను ఎత్తుకొని పోయాడు.
Sita had been kidnapped when Rama and Lakshmana reached the parnasala.

26. కేసు విచారణకు వచ్చే లోపున సాక్ష్యాన్ని నాశనం చేసేసారు.
The evidence had been destroyed when the case came up for hearing.

ఇప్పటికి past tense లో simple, continuous and perfect tense లు మూడూ పూర్తి అయ్యాయి.

27. simple futue tense లో

నేను రేపు ఈ పుస్తకం చదువుతాను.
I shall read the book tomorrow

ఈ వాక్యాన్ని passive voice లో చెప్తే
The book will be read by me tomorrow.
subject - The book (III person - singular)
will - future tense - helping verb
be form - be

past participle form of the verb - read
Read - read - read
28. రేపు రాధికకి కృష్ణతో పెళ్ళి అవుతుంది.
Radhika will be married to Krishna tomorrow.
29. ఈ నవల రెండు నెలల్లో పూర్తి అవుతుంది.
This novel will be completed in two months.
30. నాకు బహుమతి ఇస్తారు.
I shall be given a prize.
3 1. వచ్చే world cup ని భారత్ గెల్చుకుంటుంది.
The next world cup will be won by Inda.
ఇది simple future tense
తరువాత
future continuous tense లో passive voice ఉండదు.
తరువాత tense - future perfect tense.
32. వచ్చే సంవత్సరానికి పోలవరం ప్రాజెక్ట్ పూర్తి అవుతుంది.
The polavararn project will have been completed by next year.
ఈ వాక్యంలో verb - will have been completed
will - future tense
will have - future perfect tense లో helping verb
been - be form
completed - past participle form of the verb complete.
33. ఈ నెలాఖరుకి ఈ నవల పూర్తి అవుతుంది.
This novel will have been finished by the end of this month.
34. 2012కి రాజా అప్పులన్నీ తీరిపోతాయి.
All the debts of Raja will have been cleared by 2012.
Future perfect continuous tense లో passive voice లేదు.

**No man can be grateful at the cost of his individuality/**
**No country can be grateful at the cost of its sovereignity.**
**No woman can be grateful at cost of her chastity**

# Lesson- 18



## (order or request or cammand or prayer)

Order లేక request లను తెలియచేసే వాక్యాలను imperative sentence లు అంటారు. సాధారణ వాక్యాలలో మొదట subject ఆ తరువాత verb వస్తాయి. Imperative sentene లో ముందు verb వస్తుంది. వాక్యంలో subject కనబడదు. ఎందుకంటే మనం order చేసినా request చేసినా ఎదురుగా ఉన్న వ్యక్తినే కదా! అంటే subject -'you' అని అర్థం చేసుకోవాలి. Request అయితే వాక్యాన్ని 'Please' తో మొదలుపెడతాం.

1. నువ్వు జాగ్రత్తగా ఉండు.
   Be careful.
2. నీ హోమ్ వర్క్ చెయ్యి.
   Do your home work.
3. నన్ను తప్పుగా అనుకోకండి.
   Please don't mistake me.
4. సమయాన్ని వృధా చెయ్యకు.
   Don't waste time.
5. నా కోసం ఎదురు చూడు.
   Wait for me.
6. నా కోసం ఎదురుచూస్తూండు.
   Be waiting for me.
7. నాకు పదివేలు అప్పు ఇవ్వండి.
   Please lend me ten thousand rupees (ten thousands కాదు)
8. నేను చెప్పేది వినండి.
   Please hear me - or please listen to né.
9. నాకో గ్లాసు మంచి నీళ్ళు తీసుకురా.
   Please get me a tumbler of water.

లేక

Please fetch me a tumbler of water.

10. అబద్ధాలాడకు.

    Don't lie.

11. బ్రతకండి (ఇతరులని) బ్రతకనీయండి.

    Live and let live.

12. మంచిగా ఉండు. మంచిని చెయ్యి.

    Be good and do good.

**If the people are good, rulers are unnecessary.**

**If people are bad rules are useless**

# Lesson - 19



1. నువు బాగా చదివితే ఫస్ట్‌క్లాసు తెచ్చుకుంటావు.
If you study well, You will get first class.
ఇంకా పరీక్షలు అవ్వలేదన్నమాట. పరీక్షలకి ముందు విద్యార్థికి
ప్రోత్సాహకంగా అనే మాట యిది.



2. నువ్వు బాగా చదివి ఉంటే ఫస్ట్‌క్లాసు తెచ్చుకుంటావు.
If you studied well, you would get first class.
పరీక్షలైపోయాయి. ఇంకా ఫలితాలు రాలేదు. విద్యార్థికి ధైర్యం చెప్పేమాట.

3. నువ్వు బాగా చదివి ఉంటే ఫస్ట్‌క్లాస్ వచ్చి ఉండేది.
If you had studied well, you would have got first class.

ఈ వాక్యాలను conditional sentence అంటారు.
If you study well — ఒక భాగం. You will et first class రెండో భాగం.
If you study well - నువ్వు బాగా చదివితే ఇది condition. కనుక దీన్ని
conditional clause అంటారు. ఇది subordinate clause
ఈ condition నెరవేరితే ఫలితం రెండో - clause. నీకు First class వస్తుంది.
దీన్ని Main clause అంటారు. ఇలాగే మిగిలిన రెండు వాక్యాల్లో కూడా.



ఇక verb ల సంగతి.
I వ వాక్యంలో If you study well you will get first class.
If clause verb - study
ఇది simple present tense లో ఉంది.
Main clause లో verb - will get ఉంది.
ఇక్కడ will get లాగే can get లేదా may get కూడా ఉపయోగించవచ్చు.
ఇప్పుడు
If you study well, you can get first class.
If you study well you may get first class అనవచ్చు.
2వ వాక్యంలో Subordinate clause - If you study well

verb - studied ఇది Simple past tense లో ఉంది.
Main clause లో would get రావాలి.
would get లాగే could get లేదా might get అని కూడా అనవచ్చు.
3వ వాక్యంలో subordinate clause - If you had studied well
దీనిలో verb - had studied past perfect tense
Main clause - you would have got first class.
would have got బదులుగా could have got లేక might have got కూడా ఉపయోగించవచ్చు.
If you had studied well, you could have got first class.
If you had studied well, you might have got first class
ఈ వాక్యాలలో రెండో భాగం మొదట్లో చెప్పవచ్చు.
Ydu will get first class if you study well
You would get first class if you studied well.
You would have got first class if you had studied well.
ఈ చివర వాక్యాన్ని అదే అర్థంలో If లేకుండా కూడా అనవచ్చు.
Had you studied well, you would have got first class.

**All of us are more or less fools, but some insist on proving it.**

# Lesson - 20



1. రామ్మూర్తి గారు మంచి టీచర్ అని నాకు తెలుసు.
I know that Mr. Rama Murty is a good teacher.
2. తాను ఇకపైన బాగా చదువుతానని ఝాన్సీ అంటోంది.
Jhansi says that she will study well here after.
3. స్కూలుకి వెళ్ళడానికి రోజూ పదిమైళ్ళు నడిచే వాడినని సుబ్రహ్మణ్యం గారు అంటూంటారు.
Mr. Subrahman,iam says that he used to walk ten miles everyday to go to school.

ఎవరో నాతో చెప్పిన, లేదా నేను అనుకొన్న విషయాన్ని నేను నీతో (ఎదుటి వ్యక్తితో) చెపుతున్నాను.

ఈ వాక్యాలలో that వెనుకనున్నది ఒక భాగం. దీన్ని reporting Speech అంటారు. ఇది main clause.

that కి తరువాత ఉన్నది రెండోభాగం. దీన్ని reported speech. ఇది subordinate clause

ఈ వాక్యాలలో రెండేసి verb లు ఉన్నాయి. ఒక్కొక్క clause లో ఒక్కొక్క verb ఉంది. ఒక clause అంటే ఒక verb ఉంటుంది. ఈ రెండు clause లను కలిపే మాట that. దీన్ని subordinate conjunction అంటారు.



ఇప్పుడు ఒక్కొక్క వాక్యాన్ని చూద్దాం.

1. రామ్మూర్తి గారు మంచి teacher అని నాకు తెలుసు.

నాకు తెలుసు ఇది present tense లో ఉంది.   I know

రామ్మూర్తి గారు మంచి మాస్టారు. ఇదీ present tense అనుకొంటే
Mr. Rama Murthy is a good teacher.

రెండూ కలిపితే

I know that Mr. Rama murty is a good teacher.

Tense ఏది అనేది చెప్పేవాడికి, వినేవాడికి తెలుస్తుంది. రామ్మూర్తిగారు Past tense లో మనిషి అనుకొందాం. ఆయన గురించి నేను అనుకొన్నది కూడా

past tense కావచ్చు.
I knew that Mr. Rama murty was a good teacher.
నెహ్రూ గారి గురించి మనం మాట్లాడుకుంటుంన్నాం అనుకోండి అప్పుడు
నెహ్రూ గారు గొప్ప రాజనీతుజ్ఞుడని నాకు తెలుసు అంటే
I know that Mr. Nehru was a great statesman.

2. ఇక పైన బాగా చదువుతానంటోంది ఝాన్సీ.
ఝాన్సీ అంటోంది - Jhansi says.
ఇక పైన బాగా చదువుతాను. shall study well hereafter

రెండు భాగాలనీ కలిపితే-
Jhansi says that she will study well thereafter
3. స్కూలుకి వెళ్లడానికి రోజూ పదిమైళ్ళు నడిచేవాడిన అంటూంటారు
సుబ్రహ్మణ్యంగారు.
సుబ్రహ్మణ్యంగారు అంటూంటారు - Mr. Subrahmaniam says
స్కూల్ వెళ్లడానికి పదిమైళ్ళు నడిచే వాడిని అని he used to walk ten miles everyday to go to school
రెండింటినీ కలిపితే
Mr. Subrabmaniam says that he used to walk ten miles everyday to go to school.
3. పాపులు నరకానికి పోతారని శాస్త్రగ్రంథాలు చెపుతున్నాయి.
The scriptures say that the sinners go to hell.

simple present tense - the sinners go to hell.
పాపులు నరకానికి పోతారు అనేది నిత్యసత్యం.
కనుక ఇది simple present tense లోనే ఉండాలి.

4. భూమికి గురుత్వాకర్షణ శక్తి ఉందని న్యూటన్ కనిపెట్టేడు.
Newton invented that the earth has gravitational force.
(3,4 వాక్యాలను పోల్చుకొని ఇంకోసారి చదవండి.)
5. చట్టం తన పని తాను చేసుకొంటూపోతుందని ప్రధాని అంటూంటారు.
The P.M. Says that the law will take its own course of action.
6. రోమన్లు గొప్ప న్యాయశాస్త్రవేత్తలని చరిత్ర చెప్తోంది.
History reveals that the Romans were experts in law
7. తనకి వంట్లో బాగా లేదని చంటి నాతో అన్నాడు.
చంటి నాతో అన్నాడు. ఇది past tense

chanti told me.

నాకు ఒంట్లో బాగా లేదు. I am not doing well

ఇది present continuous tense

నాతో అన్నప్పుడు అతనికి ఒంట్లో బాగాలేదు.

అతను నాతో చెప్పినపుడు present continuous tense

కానీ ఆ విషయం నేను ఇప్పుడు నీతో చెప్తున్నాను. కనుక చంటి చెప్పినది past continuous tense అవుతోంది.

కనుక was not doing well అనాలి.

ఇంకో సంగతి చంటి తనకి ఒంట్లో బాగా లేదన్నప్పుడు
I am not doing well

చంటికి బాగా లేదని నేను నీతో చెప్పాలంటే he (చంటి)was not doing well అనాలి.

రెండూ కలిపితే Chanti told me that he was not doing well

8. తన వయస్సు 70 ఏళ్లని అవధాన్లు గారు నాతో అన్నారు.
Mr Avadhanulu told me that he was seventy.

9. పరీక్షలు బాగా వ్రాసానని హరి నాతో చెప్పాడు.

హరి నాతో చెప్పాడు. ఇది past tense - Hari told me.

పరీక్షలు బాగా వ్రాసాను. ఇదీ past tense.

ఇది నేను నీకు చెప్తున్న సంగతి present

హరి నాతో అనడం - past

తాను పరీక్షలు బాగా వ్రాసిన విషయం. ఆ past కి past.
- past perfect.

హరి గురించి నేను నీతో చెప్పినప్పుడు హరిని he అనాలి.
Hari told me that he had written the exams well.

హరి నాతో చెప్పినది - past tense

తాను పరీక్షలు బాగా వ్రాసినది - past tense

ఇందులో రెండు past actions ఉన్నాయి.

తాను పరీక్షలు బాగా వ్రాయడం ముందు జరిగింది. కనుక ఇది past perfect tense లో ఉండాలి.

హరినాతో చెప్పినది తరువాత జరిగినది. ఇది simple past tense కనుక
Hari told that he had written the exams well.

10. తాను గీతను చదివానని సుపాణి గాయత్రితో అన్నాడు.
Supani told Gayatri that he had read the Gita.
11. నాలుగేళ్ల నుంచి సంస్కృతం నేర్చుకుంటున్నానని సత్యవాణి నాతో అంది.
Satyavani told me - past tense.

నాలుగేళ్ల నుంచి సంస్కృతం నేర్చుకొంటున్నాను.
అని సత్యవాణి నాతో అన్నప్పుడు present perfect continuous tense.
కాని సత్యవాణి నాతో అనడం past tense.

past tense కి present perfect continous tense ఏమవ్వాలి?
past perfect continous tense అవ్వాలి.
కనుక
Satyavani toad me that she had been learing sanskrit for four years then.
12. అక్కడ ఆరునెలల నుంచి పనిచేస్తున్నానని పద్మిని చెప్పింది.
Padmini said that she had been working there for six months then.
13. నీకు US నుంచి గిఫ్ట్ తెస్తానని సురేష్ promise చేసాడు.
సురేష్ promise చేసింది past tense.
నీకు US నుంచి gift తెస్తాను. అప్పటికి future tense కాని ఆ విషయం నీతో చెప్తున్నప్పటికి past tense అయ్యింది. అప్పుడు Suresh promised me that he would bring a git from the U.S.

14. నేను ఎయిర్‌పోర్ట్ దగ్గర తనని రిసీవ్ చేసుకొంటానని మూర్తి గారు expect చేసారు.
Mr. Murty expected that i would receive him at the airport.

15. వచ్చే వరల్డ్‌కప్ ఇండియా గెలుస్తుందని రామన్‌గారు జోస్యం చెప్పారు.
Mr. Raman predicted that India would win the next world cup.
16. మర్నాడు 12 కి తాను లంచ్ చేస్తూంటానని కిరణ్ చెప్పాడు.
Kiran told that he would be having lunch by 12 noon next day.
17. వచ్చే నెల ఒకటో తారీఖుకి లోన్ పూర్తి అయిపోతుందని రామయ్య హామీ ఇచ్చాడు.
Ramiah assured that the loan would have cleared by the first of next month.
order or request లను చెప్పే వాక్యాలను imperative Sentence లు

అంటారు. ఉదాహరణకు

18. మా టీచర్ కాలాన్ని వృదా చేయ్యవద్దని చెప్పారు.

మా teacher చెప్పారు. our teacher told.

కాలాన్ని వృదా చెయ్యకండి Don't waste time.

ఇదే model వాక్యాలలో రెండు క్లాజులకి మధ్య that వచ్చింది.

ఈ వాక్యాలలో to గానీ not to గానీ చెప్పాలి.

Affimative అయితే to, negative అయితే not to

My teacher told us not to waste time

19. 1942 ఆగష్టులో కాంగ్రెస్ బ్రిటిష్ వారిని క్విట్ ఇండియా అని డిమాండ్ చేసింది.

The congress demanded the British in Aug. 1942 to quit India.

20. నిందితుణ్ణి విడుదల చెయ్యమని పోలీసులకు జడ్జి ఆదేశించారు.

The judge crdered the police to release the accused.

21. తనకు గ్రామర్ చెప్పాల్సిందిగా కుమార్ రామ్మూర్తి గారిని కోరాడు.

Kumar requested Mr. Rama murty to teach him grammar

22. హేమ తన కొడుకుని నోరు మూసుకొని నిశ్శబ్దంగా ఉండమంది.

Hema asked her son to shut up and keep quiet.

ఈ మూడు పదాల తేడాని తెలుసుకొండి. quit, quiet, quit

23. తనని వెళ్ళనీయమని ఆ పెద్దమనిషి పోలీసులని కోరాడు.

The gentleman requested the police to let him go.

24. నీ పొరుగు వానిని నీలాగానే ప్రేమించమని బైబిల్ బోధించింది.

The Bible ordains everyone to love ones neighbour as onesself.

25. అప్పు అడిగే వాడివి కావద్దు. అప్పిచ్చే వాడివి కావద్దు. అని పోలోనియస్ కుమారుడికి సలహా ఇచ్చాడు.

Polonius advised his son to be neither a borrower nor a lender.

ప్రశ్న వాక్యాలను Interogative sentense లు అంటారు.

ప్రశ్నకి అవును లేదా కాదు జవాబువస్తే దాన్ని yes - no answer question అంటారు.

Ex: Do you like mangoes?

ఎవరు, ఎక్కడికి, ఎప్పుడు వంటి వివరాలడిగే ప్రశ్నలు.

Ex: What is your father?

వీటిని wh questions అంటారు.

26. నీ home work చేసావా అని teacher అడిగారు.

The Teacher asked ఇది past tense.

Did you do your homework? ఇది past tense.

ఇంతకు ముందు వాక్యాల్లో 'that' 'to' వచ్చినట్లుగా

ఆ స్థానంలో ఈ వాక్యాల్లో If గానీ whether (weather కాదు) గానీ వస్తుంది.

కనుక The teacher asked (me) if I had done my homework

27. నువు నన్ను ప్రేమిస్తావా అని రాకేష్ అమృతను అడిగాడు.

Rakesh asked Amrita if she would love him.

28. నువు నాకు సాయం చేస్తావా అని రాజు జ్యోతిని అడిగాడు.

Raju asked Jyothi if she could help him.

29. నీకు మామిడి పళ్ళు ఇష్టమా అని మా బాబాయి శ్రీలతను అడిగాడు.

My uncle asked srilatha if she liked mangoes.

30. నిన్నో ప్రశ్న అడగవచ్చా అని రాధ, కృష్ణని అడిగింది.

Radha asked krishna if she would ask him a question.

31. నీ పేరేమిటి అని ప్రిన్సిపాల్ నన్ను అడిగారు.

నీ పేరేమిటి? What is your name?

The prinicipal asked what my name was.

what, who మొదలైన ప్రశ్న వాచకాలని interogative pronouns అంటారు.

subordinate clause - interogative pronoun తోనే మొదలవుతుంది. that, to, it వంటి అదనపు మాటలేమీ రావు.

The principal asked me what..........

question - what is your name? అని ఉంటుంది.

నీ పేరేమిటని Pnnicipal అడిగారు.

నీ పేరేమిటని Prinicipal అడిగారు అని నీతో చప్తున్నాను.

your name - my name అవుతుంది.

The principal asked what my name................

ఇది past tense కనుక is ని was గా మార్చాలి.

question లో what is your name అంటే is యొక్క స్థానం what కి తరువాత, your name కి ముందు ఉంది.

కాని ఈ వాక్య నిర్మాణంలో what తరువాత వెంటనే subject రావాలి.
తరువాత - Verb.
so, final గా
The Prinicipal asked what my name was
32. నీకేంకావాలి అని మా నాన్న అడిగారు.
My Father asked me
what do you want? అని అడిగారు. ఆ సంగతి నేను చెప్పాలి.
ఇందులో do want - simple present tense
Reporting verb - asked ఇది past tense
past ల్లో present tense అంటే
Present కి కూడా past అవుతుంది.
do want కి past tense - wanted
My father asked me what I wanted.
verb - wanted - వాక్యం చివర్న వచ్చిందని గమనించాలి.
33. నువ్వు ఇంగ్లీషు ఎందుకు నేర్చుకోవు అని మేరి నన్నడిగింది.
(Why don't you learn English?)
Mary asked me why I did not learn English..
34. నీకు అన్నదమ్ములెంతమంది? అని వాణి కిశోర్‌ని అడిగింది.
Vani asked kishore how many brothers he had.
35. గాంధీజీ ఎప్పుడు పుట్టారు? అని క్విజ్ మాస్టర్ అడిగారు
The Quiz master questioned when Gandhiji had been born.
36. నువ్వు ఈ పుస్తకము ఎక్కడ కొన్నావు? అని శేషు అడిగాడు.
Seshu asked where i had bought this book.
37. Paradise lost ఎవరు వ్రాసారని మా ఫ్రెండు అడిగాడు.
My friend asked who had written paradise Lost.

**Power corrupts; Absolute power corrupts absolutely.**

# Lesson- 21



ఒక వస్తువు లేక వ్యక్తి యొక్క లక్షణాన్ని చెప్పేమాట Adjectiye
He is a tall man.
Man ఎలాగుంటాడు? పొడగరి అని చెప్పేమాట tall
ఇది adjective
India is a large country
Country ఎలాంటిది? అంటే Large చెప్తోంది. ఇది adjective
మళ్లీ ముగ్గురినో అంతకంటే ఎక్కువ మందినో పోల్చేటప్పుడు
He is the tallest man.
Ganesh is taller than Ashok.
ఈ వాక్యాలలో the tallest, taller - adjective లే
tall - taller - tallest
large - larger - largest
ఇలా Adjective కి మూడేసి రూపాలుంటాయి.
వీటిని Degrees of Comparison అంటారు.
మొదటి రూపం Positive degree - tall, large
రెండవ రూపం comparative degree - taller, larger
మూడవ రూపం Superlative degree - tallest, largest



1. క్లాసులో గౌతమ్ అందరి కంటే పొడగరి.
ఈ భావాన్ని మూడు రకాలుగా చెప్పవచ్చు.
Goutham is the tallest boy in the class.
Goutham is taller than any other boy in the class.
No other boy in the class is as tall as Goutham.
ఈ మూడు వాక్యాలకీ అర్థం ఒకటే.
Superlative degree లో - the tallest
Comparative degree లో - taller than - any other
Positive degree లో - no other - as tall as

2. గోపాల్ మా ఊళ్లో అందరి కంటే ధనవంతుడు.
Gopal is the richest man in our village.
Gopal is richer than any other man in our village.
No other man in our village is rich as Gopal.

3. క్లియోపాత్ర చరిత్రలో అందరికంటే అందగత్తె.
1) Cleopatra is the most beautiful lady in the history.
2) Cleopatra is more beautful than any other lady in history
3) No other lady, in history is as beautiful as Cleopatra
beautiful more beautiful - most beautiful



ఇంకో రకం వాక్యాలు చూడండి.

4. క్లాసులో పొడగరి వాళ్లలో గౌతమ్ ఒకడు.
Gowtham is <u>one of the tallest</u> boys in the class.
Gowtham is <u>taller than many other</u> boys in the class.
Very few boys in the class are <u>as tall as</u> Gowtham.
Superlative లో - one of the tallest
comparative లో - taller than - many other
positive degree లో
very few -- as tall as
as tall as లేదా so tall as అని కూడా అనవచ్చు.
ఈ మూడు రకాల వాక్యాల్లోనూ ఏ వాక్యంలోనైనా ఈ భావాన్ని చెప్పవచ్చు.

5. గాంధీజీ మనదేశంలో అందరికంటే గొప్ప నాయకుడు.
Gandhiji is the greatest leader of our country.
Gandhiji is greater than any other leader of our country.
No other leader of our country is so great as Gandhiji.



6. రామానాయుడు గారు తెలుగు సినిమా పరిశ్రమలో అత్యంత successful నిర్మాత.
Mr. Ramanaidu is the most successful producer in the Telugu film industry
(successful - more successful - most successful)
Mr. Ramanaidu is a more successful producer than any other producer in the Telugu film industry.
No other producer in the Telugu film industry is as successful as Mr. Ramanaidu.

రెండే వస్తువులు లేక ఇద్దరే వ్యక్తులను పోల్చవలసి వస్తే Superlative degree ఉండదు. Positive, comparative రూపాలు రెండే ఉంటాయి.

7. Vijayawada is hotter than vizag.
Vizag is not so hot as vijayawada.



8. ఎన్టీఆర్ - ఏఎన్ఆర్ కంటే పాపులర్ నటుడు.
NTR is a more popular actor than ANR.
ANR is not so popular as NTR as an actor.



9. వేదాలు ప్రపంచంలో అతి పురాతన వాఙ్మయం.
The vedas are the oldest literature in the world.

10. రాముడు తన సోదరులలో పెద్దవాడు.
Rama is the eldest of his brothers.

11. నెహ్రూ కంటే పటేల్ పెద్దవాడు.
Patel was older than Nehru.
లక్ష్మణుడి కంటే రాముడు పెద్దవాడు.
Rama was elder than Lakshmana.
( నెహ్రూ పటేల్ సోదరులు కారు. కనుక older ఉపయోగించాలి. రామలక్ష్మణులు సోదరులు కనుక elder ఉపయోగించాలి.)

13. ఇంగ్లాడు ప్రపంచంలో అతి పెద్ద సామ్రాజ్యాన్ని పరిపాలించింది.
England ruled over the largest empire in the world.



14. ప్రపంచ ప్రసిద్ధ గణిత శాస్త్రవేత్తల్లో రామానుజన్ ఒకరు
Ramanujan is one of the greatest mathematicians in the world.

15. ఇప్పుడు పాలు కంటే నీళ్ళు ఖరీదు అయిపోయాయి.
Water has become costlier than milk



16. ప్రపంచంలో ఏ దేశ జనాభా కంటే చైనా జనాభా ఎక్కువ.
The population of China is greater than that (the population) of any other country.

17. వాడు నా కంటే తెలివైనవాడు.
He is more intelligent than I(am)

***EXERCISE 12***

Try to write the story of the Ramayana. Write the story in small sentences in Telugu and translate them into English. Usually any story

is narrated in the past tense. So while translating the sentences you may use simple past, or past continuous or past perfect or past perfect continuous tense.

అనగనగా ఒక రాజు ఉండేవాడు. అతడి పేరు దశరధుడు. అతడు కోసల రాజ్యాన్ని పాలించాడు. అతడి రాజధాని అయోధ్య.

దశరధుడికి భార్యలు ముగ్గురు. వారు కౌసల్య, సుమిత్ర, కైక. దశరధుడికి చాలా కాలం పిల్లలు లేరు. సంతానం కొరకు దశరధుడు ఒక యజ్ఞం చేసాడు. యజ్ఞపురుషుడు వారికి ప్రత్యక్షం అయ్యాడు. ఆ దేవుడు ఒక పాత్రలో పాయసాన్నిచ్చి తన భార్యలకు పంచియిమ్మని చెప్పి అంతర్థానం అయ్యాడు.

దశరధుడు ఆ పాయసంలో సగభాగాన్ని పెద్ద భార్య కౌసల్యకు, మిగిలిన సగ భాగాన్ని చిన్న భార్య కైకకు ఇచ్చాడు. కౌసల్య, కైక తమ కిచ్చిన పాయసంలో సగం, సగం భాగాలని సుమిత్రకిచ్చారు.

ముగ్గురు భార్యలు గర్భవతులయ్యారు. నవమాసాలయ్యాక వారికి నలుగురు కుమారులు జన్మించారు.

కౌసల్యకు రాముడు జన్మించాడు. కైకకు భరతుడు జన్మించాడు. సమిత్రకు లక్ష్మణుడు, శత్రుఘ్నుడు జన్మించారు. రాముడు అందరికంటే పెద్దవాడు. శత్రుఘ్నుడు అందరికంటే చిన్నవాడు. దశరధుడికి రాముడంటే చాలా ఇష్టం.

దశరధుడికి కుల గురువు వశిష్ఠుడు. ఆయన రాకుమారులకి రాజనీతి, అస్త్రవిద్య నేర్పాడు.

ఒక రోజు విశ్వామిత్రుడు దశరధుని వద్దకు వచ్చాడు.

తానొక యజ్ఞం చేస్తున్నానని, రాక్షసులు యజ్ఞానికి విఘ్నాలు కల్పిస్తున్నారని, ఆ యజ్ఞాన్ని రక్షించడం కోసం రామలక్ష్మణులను తనతో పంపమని విశ్వామిత్రుడు దశరధుణ్ణి కోరాడు.

దశరధుడు చాలా క్లిష్టపరిస్థితిలో పడ్డాడు. రాముణ్ణి విడిచి ఉండలేడు. అతడి కోరిక కాదంటే విశ్వామిత్రుడు ఆగ్రహం చెందుతాడు. చివరికి వశిష్ఠుడి సలహాపై రామ లక్ష్మణులను విశ్వామిత్రుని వెంట పంపించాడు.

రామలక్ష్మణులు విశ్వామిత్రుని కూడా అడవికి వెళ్లారు.

దారిలో విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు 'బల' 'అతిబల' అనే మంత్రాలను ఉపదేశించాడు. ఆ మంత్రాల వల్ల రామలక్ష్మణులు ఆకలిని నిద్రను అధిగమించారు. విశ్వామిత్రుడు రామలక్ష్మణులకి ఎన్నో గొప్ప అస్త్రములను నేర్పాడు.

వాళ్లు యజ్ఞశాల వద్దకు వచ్చారు. విశ్వామిత్రుడు యజ్ఞాన్ని ప్రారంభిచాడు. రామలక్ష్మణులు అన్ని వైపులా పరిశీలిస్తూ యజ్ఞశాలను రక్షిస్తున్నారు.

ఇంతలో తాటక అనే ఓ రాక్షసి, మారీచుడు సుబాహుడు ఆకాశంలో అరుస్తూ వచ్చి యజ్ఞకుండంలో కుండలతో రక్తాన్ని గుమ్మరించబోయారు. వెంటనే రాముడు తాటకిని ఒక బాణంతో చంపేశాడు. వెంటనే మారీచసుబాహువుల మీద కూడా బాణాలను వేసేంతలో మారీచుడు పారిపోయాడు. రాముడి బాణానికి సుబాహుడు మరణించాడు. విశ్వామిత్రుడి యజ్ఞం పూర్తి అయ్యింది.

అప్పుడు విదేహ రాజ్యాన్ని జనకుడు పాలిస్తున్నాడు. అతడి రాజధాని మిథిల. అతనికి ఒక కుమార్తె ఉంది. ఆమె పేరు సీత. సీతకు స్వయంవరం ప్రకటించాడు జనకుడు. అది తెలుసుకొని విశ్వామిత్రుడు రామలక్ష్మణులను తీసుకొని మిథిలకు బయలుదేరాడు.

దారిలో గౌతముడి ఆశ్రమం వచ్చింది. అక్కడొక రాయి ఉంది. రాముడి పాదం ఆ రాయికి తాకగానే అది ఒక స్త్రీగా మారింది. ఆ స్త్రీ పేరు అహల్య. ఆమె గౌతముడి భార్య. గౌతముడి శాపంవల్ల ఆమె రాయిగా పడిఉంది. అహల్యగౌతములు రామలక్ష్మణులను దీవించారు.

రామలక్ష్మణులతో విశ్వామిత్రుడు మిథిల చేరుకున్నాడు. మర్నాడే సీతా స్వయంవరం.

సభామధ్యంలో ఒక విల్లు ఉంది. అది శివుడి విల్లు. ఆ విల్లుని ఎక్కుపెట్టిన వాడికి సీతనిచ్చి పెళ్ళి చేస్తానని జనకుడు ప్రకటించాడు. అనేక మంది రాజులు ప్రయత్నించారు. వాళ్ళు విల్లుని ఎక్కుపెట్టడం మాట అటుంచి దాన్ని కదల్చలేక పోయారు. రాముడు వెళ్ళి ఆ విల్లుని చేతిలోకి తీసుకొని ఎక్కుపెట్టేంతలో విల్లు విరిగి పోయింది. సీత రాముడి మెడలో పూల మాల వేసింది.

జనకుడు దశరధుడికీ వార్త తెలియపరిచాడు. దశరధుడు సపరివారంగా మిథిలకి వచ్చాడు. జనకుడి సోదరుల కూతుళ్ళున్నారు. సీత రాముణ్ని, ఊర్మిళ లక్ష్మణుణ్ని, మాండవి, శ్రుతకీర్తి భరతశత్రుఘ్నులని వివాహం చేసుకున్నారు. సీతారాములు అయోధ్య చేరుకొన్నారు. పన్నెండేళ్ళు సంసార సుఖాలను అనుభవించారు.

ఒక రోజు దశరధుడు రాముడికి పట్టాభిషేకాన్ని ప్రకటించాడు. అందరూ సంతోషించారు.

దశరధుడి ఆఖరు భార్య కైక ఇంతకు ముందు దశరధుడు ఆమెకు రెండు వాగ్దానాలు ఇచ్చాడు. ఆమె దశరధుణ్ణి ఆ రెండు కోరికలు ఇప్పుడు కోరింది. రాముడు 14 సం॥లు అరణ్యవాసం చెయ్యాలి. భరతుడికి పట్టాభిషేకం చెయ్యాలి అని. అతడు తనకిచ్చిన రెండు వరాల సంగతి గుర్తుచేసింది. దశరధుడు ఏమి చెయ్యలేకపోయాడు.

రాముడు పినతల్లి కైక ఇంటికి వెళ్లి విషయం తెలుసుకున్నాడు. వెంటనే తండ్రి వాగ్దానాన్ని నెరవేరుస్తానని ప్రకటించాడు. రాముడు అరణ్యానికి బయలుదేరాడు. సీత, లక్ష్మణులు కూడా బయలుదేరారు. సీతా రామ లక్ష్మణులు ముగ్గురూ అడవికి వెళ్లారు. కొన్ని రోజులకు భరతుడు వచ్చి దశరథుడి మరణ వార్త చెప్పేడు. అయోధ్యకు తిరిగి వచ్చి రాజ్యం చెయ్యమని అడిగాడు. రాముడు మృదువుగా తిరస్కరించాడు.



సీతారామ లక్ష్మణులు అరణ్యంలో ఇంకా ముందుకెళ్లారు. అక్కడ మునీశ్వరులను బాధిస్తున్న ఖరుడు, దూషణుడు త్రిశిరుడు అనే రాక్షసులని, 14 వేల సైన్యాన్ని రాముడు చంపేసాడు.



సీతారామ లక్ష్మణులు పంచవటిలో ఆశ్రమం కట్టుకొని నివసిస్తున్నారు. శూర్పణఖ అనే రాక్షస స్త్రీ వచ్చి రాముణ్ణి పెళ్లి చేసుకొమ్మని అడిగింది. రాముడు కాదంటే లక్ష్మణుడు దగ్గరకు వెళ్లింది. లక్ష్మణుడు ఆమెను ముక్కు చెవులు కోసి పొమ్మన్నాడు.

శూర్పణఖ రావణుడి సోదరి. ఆమె వెంటనే వెళ్లి తన సోదరుడికి లక్ష్మణుడు తనకు చేసిన దాన్ని చెప్పింది. రావణుడు ఆగ్రహించాడు. శూర్పణఖ రావణుడితో సీత అందాన్ని గురించి చెప్పింది.

రావణుడు మారీచుణ్ణి పిలిచాడు. సీతను ఎత్తుకొని వచ్చెయ్యడానికి ప్లాను చెప్పాడు. కానీ మారీచుడు ఆ ఆలోచన విరమించుకోమని సలహా చెప్పాడు. రాముడు పరాక్రమం గురించి వివరించాడు. రావణుడికి కోపం వచ్చింది. మారీచుడు తప్పించుకోలేకపోయాడు. రావణుడి చేతిలో కంటే రాముడి వల్లే మరణించడం మంచిదనుకున్నాడు. రావణుడి ప్లానుకి అంగీకరించాడు.



మారీచుడు బంగారు లేడిగా మారి రాముడి పర్ణశాల సమీపంలో తిరిగుతున్నాడు. సీత ఆ మాయ లేడిని చూసి దాన్ని తీసుకురమ్మని రాముణ్ణి కోరింది. లక్ష్మణుడు వద్దని వారించాడు. అది రాక్షసుల మాయ అని చెప్పాడు. సీత వినలేదు. రాముడు ఆ మాయ లేడి వెంట పరుగెత్తాడు. ఆ లేడి చాలా దూరం పరిగెత్తింది. రాముడు ఒక్క బాణంతో లేడిని కొట్టాడు. హా లక్ష్మణా - హా సీతా అని రాముడి గొంతుతో అరుస్తూ మారీచుడు ప్రాణాలు వదిలాడు. ఆ కేకలు విని సీత భయపడింది.



రాముడే అలా అరిచాడనుకొంది. తక్షణం వెళ్లి రాముడిని రక్షించమని లక్ష్మణుడికి చెప్పింది. అది రాక్షసుల మాయ అని, రాముడికి ఏ ఆపద కలగదిని లక్ష్మణుడు ఆమెను శాంతం వహించమని నచ్చ చెప్పాడు. సీత వినలేదు. లక్ష్మణున్ని వెళ్లమని తొందర చేసింది. లక్ష్మణుడు అయిష్టంగానే రాముణ్ణి వెతుకుతూ వెళ్ళాడు. ఆశ్రమంలో సీత ఒంటరిగా ఉంది. రావణుడు ఒక ముని రూపంలో పర్ణశాల ముందు నిలబడి భిక్ష వెయ్యమన్నాడు. సీత

అన్యమనస్కంగా భిక్ష తెచ్చి రావణుడి ముందుకి వచ్చింది.

రావణుడు నిజ రూపం ధరించి సీతను పుష్పక రథంలో ఎత్తుకు పోయాడు. రథం దక్షిణ దిశగా ఆకాశంలో వెళ్ళిపోయింది. దారిలో జటాయువు అనే పక్షి రావణుడితో యుద్ధం చేసింది. కానీ రావణుడు ఆ పక్షి రెక్కలు నరికేసాడు. జటాయువు నేల మీద పడిపోయాడు. ఆకాశంలో వెళ్తూన్న సీత పర్వతం మీద ఎవరో ఉండటం చూసి తన నగలను తీసి ఒక గుడ్డలో మూటకట్టి జారవిడిచింది.రావణుడు సీతను తన లంకా రాజ్యానికి తీసుకుపోయాడు.



రామలక్ష్మణులు పర్ణశాలకు వచ్చి సీత కనబడక చాలా ఆందోళన చెందారు. అటూఇటూ తిరుగుతూ సీత ఏమయిందిని కనిపించిన వారినందరినీ అడిగారు. ఎవ్వరూ చెప్పలేక పోయారు.

అలా సీతను వెతుకుతూ వెళ్తున్న వారికి రెక్కలు తెగి భూమి మీద పడివున్న జటాయువు కనబడ్డాడు. రావణుడు సీతను తీసుకొని దక్షిణ దిక్కుగా వెళ్లాడని, అతణ్ణి ఎదురు కొన్నందున రావణుడు తన రెక్కలు ఖండించాడని, వారి కోసమే తాను ఎదురు చూస్తూ ప్రాణాలతో ఉన్నానని చెప్పి ప్రాణాలు వదిలాడు.

రాముడు జటాయువుకి అంత్యక్రియలు చేసాడు. రామ లక్ష్మణులు జటాయువు మాట ప్రకారం దక్షిణ దిశగా వెళ్లారు. అలా వారు ఋష్యమూక పర్వతం దగ్గరకెళ్లారు.

అక్కడ సుగ్రీవుడనే వానర రాజు తన నలుగురు మంత్రులతో ఉన్నాడు. అతని మంత్రులలో హనుమంతుడు ముఖ్యుడు. అతడు రాముడికి, సుగ్రీవుడికి స్నేహం కుదిర్చాడు. సీతను వెదికి రాముడి కష్టం తీరుస్తానని సుగ్రీవుడు, వాలిని చంపి వానర రాజ్యానికి అతణ్ణి రాజును చేస్తానని రాముడు ప్రతిజ్ఞ చేసారు.



ప్లాను ప్రకారం సుగ్రీవుడు వాలి నగరం కిష్కింధకు వెళ్ళి యుద్ధానికి రమ్మని పిలిచాడు. వారివురు యుద్ధం చేస్తూండగా రాముడు చెట్టు చాటు నుంచి బాణం వేసి వాలిని చంపాడు.

రాముడు సుగ్రీవుని కిష్కంధకు రాజుని చేసాడు. వాలి కొడుకు అంగదుణ్ణి యువ రాజును చేసాడు. వర్షాకాలం వెళ్ళాక సుగ్రీవుడు వానరులందరినీ తన ఎదుట హాజరు కావాలని ప్రకటించాడు.

అందరూ వచ్చాక వానరులను నాలుగు బృందాలుగా చేసి సీత ఎక్కడుందో వెదకి రమ్మని పంపాడు. సీత కనిపించినా, కనిపించకపోయినా సరిగ్గా నెలదాటకుండా వచ్చి చెప్పాలని గడువు పెట్టాడు.

దక్షిణ దిక్కుగా వెళ్ళాల్సిన బృందంలో హనుమంతుడు, అంగదుడు, జాంబవంతుడు మొదలైన వానర ప్రముఖులున్నారు. రాముడు తన ఉంగరాన్ని సీతకు గుర్తుగా చూపించమని హనుమంతునికిచ్చాడు.

వానరులు దక్షిణ దిక్కుగా వెళ్తూ అంతా వెదికారు. సీత కనబడలేదు. అలా సీతను కనుగొనకుండా కిష్కంధకు వెళ్ళడం ఇష్టం లేక వారందరు చనిపోవడానికి నిశ్చయించుకున్నారు.

అక్కడికి సమీపంగా సంపాతి అనే పక్షి నేలమీద పడి ఉన్నాడు. అతడు వానరులు అనుకొన్న మాటలు విన్నాడు. వారిని పిలిచి సీతను రావణుడు ఎత్తుకొని దక్షిణదిశగా లంక వైపు తీసుకొని వెళ్ళడం తాను చూసానని చెప్పి ప్రాణం వదిలాడు. లంక వెళ్ళాలంటే సముద్రం దాటాలి. అది వంద యోజనముల సముద్రం.

అంత దూరం ఎగరాలంటే హనుమంతుడొక్కడే సమర్థుడని జాంబవంతుడు మొదలైన వానర ప్రముఖులు నిర్ణయించారు.

ఆ ప్రకారం హనుమంతుడు సముద్రాన్ని దాటడానికి మహేంద్ర గిరి పర్వతం నుండి ఎగిరాడు.

దారిలో కొన్ని అడ్డంకులు దాటి హనుమంతుడు లంకలో ప్రవేశించాడు. అక్కడ లంకా నగర దేవత లంకిణిని చంపాడు. లంక అంతా సీత కోసం వెదికాడు. చివరికి అశోక వనంలో అశోకవృక్షం క్రింద సీతను చూచాడు. సీతకి తన కథ అంతా చెప్పి రాముడు తనకిచ్చిన ఉంగరాన్ని ఆమెకిచ్చాడు. ఆమె తన గుర్తుగా ఇచ్చిన శిరోమణిని తీసుకొన్నాడు.

తరువాత రావణుడి దృష్టిని ఆకర్షించడానికి అశోక వనాన్ని ధ్వసం చేసాడు. అది తెలిసిన రావణుడు రాక్షస వీరులని పంపించాడు. హనుమంతుడు వారినందరిని చంపేసాడు. చివరికి రావణుడి కుమారుడు ఇంద్రజిత్ వచ్చాడు. ఇంద్రజిత్ హనుమంతుడి మీద బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు.

దానిచేత బంధింపబడినట్లు హనుమంతుడు నటించాడు. రాక్షసులు హనుమంతుణ్ని రావణుడి ముందుకు తీసుకెళ్లారు. హనుమంతుడు రావణుడికి తన కథనంతా చెప్పి సీతను రాముడికి అప్పగించి రాముడిని శరణు వేడవలసిందిగా సలహా చెప్పాడు. రావణుడికి కోపం వచ్చింది. అతడి తోకకి నిప్పు పెట్టాల్సిందిగా రాక్షసులని ఆదేశించాడు. రాక్షసులు హనుమంతుడి తోకకు నిప్పంటించారు.

హనుమంతుడు వాయుదేవుని కుమారుడు. వాయుదేవుడు అగ్నిదేవుడు మిత్రులు. అందువల్ల హనుమంతుడు తోకకు నిప్పుపెట్టినా అతనికి బాధకలుగలేదు. చల్లగానే ఉంది.

మండుతోన్న తోకతో హనుమంతుడు ఓ భవనం మీదనుండి ఇంకో భవనం మీదకి దూకుతూ అన్ని ఇళ్ళకూ నిప్పు అంటించాడు. లంకలోని భవనాలన్నీ మండిపోయాయి. ఆఖరున హనుమంతుడు వెళ్ళి తోకను సముద్రంలో ముంచి ఆ మంటను ఆర్పాడు.

హనుమంతుడు తిరిగి సముద్రాన్ని దాటి ఋష్యమూక పర్వతం వద్దకు వచ్చాడు. రామలక్ష్మణులకి, సుగ్రీవుడికి తాను సీతను చూచానని వివరంగా చెప్పాడు. సీత ఇచ్చిన శిరోమణిని రాముడికి చూపెట్టాడు. అందరూ సంతోషించారు.

ఇక రావణుపై యుద్ధానికి బయల్దేరారు. వారు సముద్రం మీద వంతెన కట్టారు. అందరూ లంకను చేరారు.

రామ రావణ యుద్ధం జరిగింది. రావణుడు, కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు మొదలైన రాక్షస వీరులందరూ చంపబడ్డారు.

రాముడు విభీషణ్ణి లంకా రాజ్యానికి రాజును చేసాడు. సీతా రామ లక్ష్మణులు, హనుమంతుడు సుగ్రీవుడు విభీషణుడు ఇంకా వానర ముఖ్యులు అంతా అయోధ్య వెళ్ళారు. రాముడికి పట్టాభిషేకం జరిగింది. లక్ష్మణున్ని యువరాజుగా ఉండమని రాముడు అడిగాడు. లక్ష్మణుడు అంగీకరించలేదు. అప్పుడు రాముడు భరతుణ్ణి యువరాజు చేసాడు. రామ రాజ్యంలో రోగాల భయంలేదు. దొంగల భయం లేదు. పెద్దవాళ్ళు చిన్నవాళ్ళకి ప్రేతకర్మలు చేయలేదు. పంటలు బాగా పండాయి. ప్రజలంతా సుఖంగా ఉన్నారు.

(ఈ కథను ఇంగ్లీషులోకి అనువదించేటప్పుడు మాటకు మాట అనువదించాలని లేదు. వాక్యం పెద్దదైతే రెండు లేక మూడు చిన్న వాక్యాలుగా అనువదించవచ్చు. అలాగే తెలుగులో ఉన్న చిన్న వాక్యాలను ఒకే ఇంగ్లీషు వాక్యంగా అనువదించవచ్చు.)

**Unequal combinations are always dangerous to the weaker side.**

# Lesson - 22



ఇంగ్లీషులో భాషా భాగాలు ( Parts of Speeach) ఎనిమిది ఉన్నాయి.
వాటిలో Preposition ఒకటి. ఇది తెలుగులో విభక్తుల వంటిది.
Prroposition is palced before a noun or a pronoun to show its relation to some other word in the sentence.
అంటే వాక్యంలో Preposition తరువాత Noun గానీ pronoun గానీ వస్తుంది.
ఇప్పుడు noun లేదా pronoun ని object of the preposition అంటారు.
Look at these sentences:

1. There is no water *in* the pot.
2. Raghu is going *by* car.
3. Gopal is angry *with* you.

ఈ వాక్యాల్లో underline చేసిన పదాలు preposition లు.
మొదటి వాక్యంలో preposition - in
ఇది water కి pot కి సంబంధం చెప్తుంది.
water, pot రెండూ noun లే.
రెండో వాక్యంలో preposition - by
ఇది వాక్యంలో verb - is going కి car (noun) కి సంబంధం చెప్తుంది.
మూడో వాక్యంలో preposition - with
ఇది angry (adjective) కి pronoun you కి సంబంధాన్ని తెలియచేస్తుంది.
to, in, for, on, from, at, up, upto, in into, upon, about, after, before, under మొదలైనవి prepositions.
ఇవి చాలా చిన్నచిన్న పదాలు. కానీ వీటిని తెలుసుకొని సరిగ్గా ప్రయోగిస్తే భాషకు గొప్ప సొగసు వస్తుంది. అజ్ఞానంతో ప్రయోగిస్తే అనర్థాలు వస్తాయి.
ఉదాహరణకి:
They laughed at me.
They laughed with me.
laugh at అంటే ఎగతాళి చెయ్యడం (to redicule)
They laughed with me అంటే వాళ్లూ నాతో పాటు నవ్వేరు అని

laught at కి laugh with కి అంత తేడా.

ఇలాంటి ఉదాహరణలు ఇంకా చూద్దాం.

1.Agree upon (a course of action.)

The cabinet agreed upon raising D.A. to the employees.

Agree with (a person or a thing)

Alchohol does not agree with me.

Agree to (a proposal)

Vani did not agree to go abroad for a job.

2. Angry with (a person)

Gopal grew angry with his son for his misconduct.

Angry at (a remark)

Mohan was angry at his wife's remarks about his sister

3. Attack with (a disease)

Rani was attacked with pneumonia.

Attacked by (the enemy)

Pearl Harbour was attacked by Japan in the second world war.

4. Belive ( a person)

I don't believe you.

Believe in (Some thing)

Rajaji did not belive in socialism.

5. Break out:

The first world war broke out in 1914.

Cholera broke out in the city.

Break into

The thieves broke into his shop and looted it.

6. Call at (someone's house)

Trupathi Piligrims used to call at NTR's house in Madras

Call on:

The leaders of all parties called on the Governor to greet him on the new year day.

Call for:

The officer called for an explanation from the clerk for his negligence of duty.

Call off:

The N.G. G.OS called off their strike following on an agree

ment with the government.

7. Differ from (to be dissimilar)
   Salt and camphor look alike. But they differ from each other in flavour.
   Differ with (to be in disagreement)
   Netaji differed with Gandhiji on several issues.
8. Engaged to (some one)
   Jyothi is engaged to Chinmaya.
   Engaged in (an activity)
   Veeresalingam was engaged in social reformation.
9. Fight with (on the side of)
   Pandavas's uncle salya fought with the kouravas in the war of kurukshetra.
10. Give in (Accept)
    I gave in to his proposal
    Give up
    We must give up bad habits and bad friends as well.
    Give away (to distribute)
    The C.M. gave away pensions to the disabled in the Racchabanda programme.
11. Grateful to:
    We must be grateful to everyone who helps us.
    Grateful for :
    Karna was always grateful to Duryodhana for his support.
12. Keep on:
    The sages keep on chanting mantras.
    Keep to:
    The pedestrains must keep to their left on the road.
    keep up :
    Oh! well done! you must keep it up.
13. Live in: Supani lives in Chennai.
    Live at: He lives at no.10 Kasthuri Street.
    Live on : The Sages could live on air for several days.
    Live by (Profession)
    Athreya lived by writing for films.

14. Look at:

Oh! Look at the moon! How beautiful she is!

Look up to:

The congress always looked up to Gandhiji for his guidance.

Look down upon:

Venu has a feeling that he is being looked, down upon by nis wife

Look after: we ought to look after old parents.

15. Meet (a person)

Netaji met Hitler during second world war.

16. Meet with:

Notaji met with a plane accident

Need of: Ramu has poor eye sight and is in need of glasses

Need for: There is a need for a school in this area.

17. Pass for (to be regarded)

Among villagers he passed for a scholar.

Pass off

(1) (to stop) The rain passed off,

(2) (to take palce successfully): The assembly sessions passed off peacefully

Pass away (to die)

Nehru passed away on 27th May 1964.

18. Part from (a loved one)

Lakshmana parted from his wife and mother and followed Sita and Rama to the forest.

Part with (to be seperated from) suresh could not part with his car.

19. Put off (to postpone)

Never put off till tomorrow what you can do today.

put up (to take up ones lodging) when you come to Agra you may put up my house.

Put on (to wear) we usually put on new dress on Ugadi.

Put out (to extinguish as light)

It is a good habit to put out the lights before going to bed.

Put forth: (to exert) Mr. Murthy Put forth all his strength and won the prize.

20. Quarrel over (something)

Durga always quarrels with vani over politics

ఇలాంటివి వందలాది ప్రయోగాలు ఉంటాయి. చదివే కొద్దీ తెలుస్తాయి.

**Work must be useful and work must be cheerful**

# Lesson - 23

Common Errors

నిత్యవ్యవహారంలో పెద్దవాళ్ళు మాట్లాడే ఇంగ్లీషులో కూడా తప్పులు దొర్లుతూంటాయి. అవి చిన్న చిన్న తప్పులు. సామాన్యులకు అవి దొరకవు. కానీ సామాన్యులు మాట్లాడే ఇంగ్లీషులో సర్వసాధారణంగా వినిపించే తప్పులుంటాయి. అవి చిన్న తప్పులు కావు. కొంచెం తెలిసినవాళ్ళు వింటే నవ్వుతారు.

ఒక ఉదాహరణ:

1. Government Employers కదండీ! ఎదురుగా ఉన్నవాడు కూలోడా, ముష్టోడా అన్న బాధలేదు - లంచం లాగాల్సిందే!

ఈ వాక్యంలో Government employers అంటే ఉద్యోగస్థులు / Employees అనే అర్థంలో ప్రయోగించారు. అది తప్పు.

Employers= యజమానులు

Employees= ఉద్యోగస్థులు

Governement employees అనాలన్నమాట.

2. Question Paper చూసి

అమ్మో Paper చాలా tough ఉంది. ఇందులో అయిదారు problems చాలా typical గా ఉన్నాయి. అన్నారొకాయన typical అంటే చాలా క్లిష్టంగా అని ఆయన ఉద్ధేశ్యం కానీ typical కి ఆ అర్థం లేదు. Dictionary లో Combining and showing the main sign of a particular kind, group or class అని అర్థం ఉంది.

Ex : A typical eighteenth Century Church.

అంటే 18వ శతాబ్దం నాటి చర్చి నిర్మాణంలో ముఖ్యమైన పోకడలు లక్షణాలు కలిగి ఉన్నది. ఒక రకం buliding నమూనా!

type లోంచి వచ్చిన మాట typical.

Problems critical గా ఉన్నాయి అంటే మేలు.

3. పదాల అర్థంలోనే కాదు - ఉచ్చారణలో తేడా -

ఇంక్‌పిల్లర్ (ink pillar) పదాన్ని చూడండి.



Ink bottles లేవిప్పుడు. కానీ eye drops వేసుకునేందుకు ఉపయోగిస్తున్నాం.

అది Ink Piller కాదు ink filler.



4. రైలు బోగీలలో టూటయర్ Compartment లు

త్రీటయర్ కంపార్ట్‌మెంటులు అంటూంటారు కదా!

బెర్తులు ఒక దానిపైన ఒకటి, రెండు అంతస్థులుంటే అది టూటయర్ బోగీ. బెర్తులు ఒక దాని పైన ఒకటి మూడు అంతస్థులుగా అమర్చిన బోగీ - త్రీటయర్ కంపార్ట్‌మెంటు.

కానీ అది టయర్ కాదు. టియర్

రైలు బోగీ మీద three tier compartement అని రాసి ఉంటుంది. tier ని టయర్ అనీ చదవచ్చు. టియర్ అనీ చదవవచ్చు. కానీ క్రింద హిందీ లిపిలో టియర్ అని వ్రాసి ఉంటుంది. ఇప్పుడు తప్పనిసరిగా టియర్ అనే అనాలి. అని తెలుస్తుంది. ఈ tier పదం ఇంకో సందర్భంలో కూడా చాలా ప్రముఖంగా ప్రయోగంలో ఉంది.



The Indian constitution prvides for three tier. system in the constitution of the cabinet ministers.



They are - cabinet minister, deputy minister and ministers of staste.

( tier, tire, tyre పదాల తేడాను గమనించండి.)

5. ఒకోసారి భాషలోలేని పదాలు వాడకలో కనిపిస్తాయి.

ఛీటర్ (cheater) మోసం చేసేవాడు అనే అర్థంలో, కానీ - ఇంగ్లీషులో

మోసం చెయ్యడం అంటే to cheat.

one who cheats is called a cheat.

ఛీట్ చేసేవాడు ఛీట్ అంతే కాని ఛీటర్ కాదు.

6. ఇంటర్మీడియట్ - డిగ్రీ కోర్సు చదువుతున్న విద్యార్థులు హాల్‌టికెట్‌ల కోసం passport size photo లు తీయించుకుంటారు. ఆ ఫోటోలో నడుముకు పైభాగం ఉంటే చాలు. విద్యార్థులు - విద్యార్థినులు కూడా స్టూడియోకి వెళ్లి breast size photo తీయమని అడుగుతారు. అది breast size కాదు bust size.



bust = the human head, shoulders and chest

కానీ breast అంటే స్త్రీ వక్షోజాలు.



7. Emergent: చాలా అర్జంటుగా అనే అర్థంలో ఈ పదం వాడుకలో ఉంది. కానీ emergent కి ఈ అర్థంలేదు. ఆ పదం emerge కి సంబంధించింది.

Emerge = to come or appear out of some where.

The sun emerged from behind the clouds.

emerge అనే verb కి adjective form - emergent అంటే emerge అయినట్టి అని అర్థం.

emergency అనే పదంతో కూడా emergent కి ఏమీ సంబంధం లేదు.

emergency అంటే అత్యవసర పరిస్థితి తొందర, త్వరగా అనే అర్థంలేదు.

emergent కూడా ఇలాంటిదే.

8. Female: స్త్రీలని females అనడం పరిపాటిగా ఉంది.



కానీ .. అనే పదం ఆడ - మగ ( sex ) చెప్పడం వరకే ఉపయోగించాలి.

She gave birth to a female (or male) child.

Female అనే ఒక్క మాటకే అంటే అది Female dog, Female cat, Female Flower ఇలా ఏదైనా కావచ్చు. కానీ ఆడ మనిషి అనాలంటే వాడాల్సింది Woman



There are thirty Femaes in the class తప్పు

There are thirty girls or ladies (వయస్సుని బట్టి) ఇది ఒప్పు.

- Male voice, Female walk ఇలా ఇది తప్పు.

Masculine voice, Feminine Walk etc.

Manju has a masculine voice

Rarna Krishna has a feminine Walk అనాలి.

దేశంలో ఆడ జనాభా, మగ జానాభాల గురించి మాట్లాడేటప్పుడు male population, female population కంటే men population, women population

అనడం మెరుగు.

ఆంధ్రప్రదేశ్ ప్రాథమిక విద్యాశాఖలో స్త్రీల అక్షరాస్యత శాతం బాగా తక్కువగా ఉండే ప్రాంతాలలో ఉండే పాఠశాలల్లో LFL Post లు ఉన్నాయి.

అంటే Low Female Literacy.

ఈ ప్రయోగం సరియైనదేనా?

Low Women Literacy అనడం ఉచితం కాదా!

ఇది విచారణీయము.

9. Backside Backside of the house, on the backside of the paper ఇలాగ ఒకవైపు అర్థంలో ఉపయోగించడం వింటూంటాం.

backside అంటే (పిదురులు) అనే అర్థం

back of the house, back of the paper సరియైన ప్రయోగం.

10. Keep-Put:

తెలుగులో ఈ రెండు మాటలకీ పెద్ద తేడా అనిపించకపోవచ్చు. ఇంగ్లీషులో చాలా తేడా ఉంది.

Keep implies retention put implies the act of placing

I put my dictionary in my shelf

I kept my dictionary in my shelf.

ఈ రెండూ సరియైనవే. కానీ

I kept my diclionery In my friend's house.

ఇది సరికాదు.

I put it in my friends house

మా Friend చేసే పని Keeping.

I put my ornament in the bank locker.

The bank kept my ornament in the locker.

11. Meals:

Have you taken your meals?

ఒకేసారి ఎన్ని meal తింటాడు?meal కిmeals కి అని Plural గా ఎందుకు వాడుతారో తెలియదు.

Have you had your food అనవచ్చు .

లేదా రాత్రి భోజనమో పగటి భోజనమో దృష్టిలో ఉంచుకుంటే

Have you had your Lunch?

Have you had your Dinner? అనవచ్చు

12. Before - ago

I saw him one month before.

I saw him before one month

ఈ రెండూ తప్పే.

I saw him a month ago అనడం మంచిది.

## Atom bomb is the horbinger of peace

# Lesson- 24



Articles (A, An, The)
A, An, The లు Adjectives
వాటిని Demonstrative Adjectives అంటారు.
This, Those, These, Such లు కూడా

Demonstrative Adjectives రకంలోనివే. కానీ A, An, The లని ప్రత్యేకంగా Articles అని అంటారు.

ఈ మూడింటిలో A, An లను countable articles అని the ని uncountable article అని అంటారు.

ఇది ఒక విభాగము.

A, An లను Indefinite Articles అని The ని Definite article అని అంటారు.

ఇదొక విభాగము.

Once there was a king

ఒకప్పుడు ఒకానొక రాజు ఉన్నాడు. ఆ రాజు ఫలానా అని చెప్పలేదు. అంటే definite కాదు. కథ ప్రారంభంలో 'ఒకానొకరాజు' అంటాం.

తరువాత వాక్యంలో

ఆ రాజుకి ఏడుగురు కొడుకులున్నారు. అంటే



ఈ పాత్ర మనకు తెలియదు కనుక, మొదటి వాక్యంలో a king అని indefinite article 'a' వాడాము.



తరువాత వాక్యంలో 'ఆ రాజు' అన్నాం. ఈ పాత్ర మనకు పరిచయం అయింది.

అంటే

The king had seven sons

అనాలి.

ఇప్పుడు Definite Article - The ఉపయోగించాము.

అలాగే

I Saw a boy crossing the road

వాక్యంలో 'boy' గురించి ఇంతకు ముందు పరిచయం లేదు కనుక

Indefinite Article 'a' ఉపయోగించాము.

ఇక్కడ a అంటే ఒకానొక అని తరువాత

An auto hit the boy

ఆ బాలుణ్ణి ఆటో ఢీ కొట్టింది అన్నప్పుడు Definite article The

ఉపయోగించాం. అలాగే



A ,An లను ఉపయోగిస్తే 'ఒక' అని అర్థం లెక్కపెట్టగలిగే సందర్భంలో 'ఒక' అంటాం.

A boy was crossing the road



లెక్కపెట్టేవి, లెక్కపెట్టనివి అంటే వస్తువులు మనుషులు, ప్రాణులు అంటే

Noun కదా!

కాబట్టి A, An, The లు Nouns కి ముందు వస్తాయన్నమాట.

అదే

బాలురు రోడ్ దాటుతున్నారు అనాలంటే

The boys are crossing the road

అనాలి. అంటే...బహువచనానికి ముందు A, An వాడకూడదు. The వాడాలి.

A ,An లలో దేనిని ఎప్పుడు వాడాలి? మనకు ఇంగ్లీష్ అక్షరాలలో a,e,i,o,u లను vowels (అచ్చులు) అంటాం.

మిగిలిన 21 అక్షరాలను consonants (హల్లులు) అంటాం.

'Vowel Sound' ఉన్న అక్షరంతో మొదలైన nouns కి ముందు an వాడాలి.

ఇక్కడ గమనించాల్సింది.



'Vowel' తో మొదలైన అనలేదు

Vowel sound తో మొదలయ్యే noun కి అన్నారు.



An aeroplane, an ant

An egg, an examiner

'e' అక్షరంతో మొదలయ్యే పదాలలో కొన్నింటిని 'యూ' sound తో పలుకుతాం.

ex: European కనక an వాడకూడదు.

A European అనాలి.

An ink bottle, an industrialist

An ox

He comes from an orthodox family.

'o' అక్షరంతో మొదలయ్యే one పదాన్ని వన్ అని చదువుతాం. s కాదు.
కనుక This is an one rupee note అనకూడదు.
This is a one rupee note. అనాలి.
U అక్షరంతో మొదలయ్యే పదాలలో కొన్నింటిని 'అ' ధ్వనితో పలుకుతాం.
కనుక వాటి ముందు an వ్రాయాలి.
An umbrella, an ugly fellow etc.
కొన్ని పదాలను 'యూ' Sound తో ఉచ్చరిస్తాం. University మొ॥వి.
వాటిముందు 'a' ని వాడాలి.
A university
Doolagunda is also a useful plant
consonants మొదలయ్యే పదాలలో
'h' తో మొదలయ్యే కొన్ని పదాలని 'అ' ధ్వనితోనూ కొన్నింటిని 'హ'
ధ్వనితోనూ ఉచ్చరిస్తాం.
An hour, An honest man
హ తో మొదలయ్యే పదాలకు ముందు 'a' వాడాలి.
A half, a hatric
An hour and a half
M A, M.L.A., N.G.O..... abbreviations 'ఎ' ధ్వనితో మొదలవుతాయి.
కనుక
Reavindra is an M.P.
Murthy is an NGO అనాలి.
ఏకవచనంలో ఉండే ప్రతి common noun కి ముందు తప్పని సరిగా a లేక
an ఉపయోగించాలి.
The ని ఏకవచనంలోనూ, బహువచనంలోనూ కూడా ఉపయోగించవచ్చు.
The girl, the girls, the book,the books.... etc.
The ప్రయోగంలో చాలా విశేషాలు ఉన్నాయి.
proper nouns కి ముందు Article ఉండదు.
ఇది సాధారణ నియమం. కానీ
1) నదులు, సముద్రాలు, దీవుల సముదాయాలు, పర్వత శ్రేణుల పేర్లు అవి
proper nouns అయినా వాటి ముందు The ఉండాలి.
The Godavari, The Indian Ocean

The Andamans, The Himalayas etc.

2) పవిత్ర గంథాల పేర్లకి ముందు The ఉండాలి.

The Vedas, The Gita, The Bible, The Khuran etc

3)Abbreviation లో ఉన్న దేశాల పేర్లకి ముందు The ఉండాలి.

The U.S.A, The U.A.E



England అంటే దాని ముందు The ఉండకూడదు.

U.K. అంటే ఉండాలి. The U.K. అనాలి.

4) మనుష్య జాతుల పేర్లకి ముందు The ఉండాలి.



The ఉపయోగించకుండా English అంటే భాష

The English అంటే ఇంగ్లీషు జాతి.

5) Adjective కి ముందు The ఉపయోగిస్తే The rich అంటే ధనవంతులు అనే plural noun అవుతుంది.

6) The ని common noun కి ముందు ఉపయోగిస్తే జాతి వాచకం అవుతుంది.

The cow is a domestic animal

దీనికి మళ్ళీ మినహాయింపు. మానవులందరికీ వర్తించాలా?

Man is mortal

ఇక్కడ the man కాదు.

7) Proper noun కి ముందు The ఉపయోగిస్తే,

Bombay is the Monchester of India అంటే ఇంగ్లాండ్‌లో Monchester నగరం ఎలాగో (వస్త్రపరిశ్రమ కేంద్రం) ఇండియాలో బొంబాయిలో



Patel is the Bismark of India.

జర్మనీని బిస్మార్ ఎలా ఏకీకరణం చేసాడో ఇండియాకు పటేలు అలాగ.



8) గ్రహాల ముందు

The Sun, The Moon, The Earth అలా ఉపయోగించాలి.

9) Superlative degree లో Adjective కి ముందు The best, The cleverest One of the richest వలె the ఉండాలి.

10) Comparative degree లో Adjective కి ముందు the ఉపయోగిస్తే

The higher you go, the cooler it gets

నువ్వు ఎంత ఎత్తుకి వెళ్తే అంత చల్లగా ఉంటుంది.

The less we talk about him, the better is would be

వాడి గురించి మనం ఎంత తక్కువ మాట్లాడితే అంత మంచిది.

The more you have the more you want.

నీకు ఎక్కువ ఉన్నకొద్దీ ఇంకా ఎక్కువ కావాలనుకుంటావు.

**Philosophy begins where science ends.**

# Lesson- 25



Question tag:

విద్యార్థులకి 10వ తరగతి, ఇంటర్ ఇంగ్లీషు పరీక్షలలో Question tag ప్రాధాన్యత ఉంది. ఇంగ్లీషు సంభాషణలలో Question tag వాడకం చాలా ఎక్కువ. మనం తెలుగులో మాట్లాడేటప్పుడు 'ఈ అమ్మాయికి పెళ్లి అయ్యింది కదా?' 'మా అన్నయ్య యు.ఎస్. నుండి వస్తున్నాడు. అవును కదా?' అంటూ ఓ వాక్యం చెప్పేసి, వెంటనే అవును కదా? కాదా? అంటూ ప్రశ్నలను తగిలిస్తుంటాం. ఇదే మూసలో అప్పుడప్పుడు ఇంగ్లీషు వాక్యాలు అంటూ 'He did not come to school yesterday. itn't it?' "All the conntnier are fawreg the prolew of terrorism. is n't it?" చివర్ల is n't it? అంటూంటారు అలవాటుగా.



Question tag అంటే అదేకాని, ఆ విధానం సరియైనది కాదు. Question tag ఉద్దేశ్యం ఏమిటంటే మనం ముఖ్యమైన విషయం ఏదోచెప్పి వినేవాడు సరిగ్గా వింటున్నాడా? అని వాడుకూడా ఈ అభిప్రాయంతో ఏకీభవిస్తున్నాడా అని నిర్ధారించుకోనడమే.

ఉదాహరణ:

Gopal is an honest man.



1. ముందు వాక్యంలో verb నిచూచి, దానిని helping verb+principal verb గా భావించండి.

ఈ వాక్యంలో verb-is ఇదే helping verb, principal verb



be-form verb అయితే మార్చేది ఏమీలేదు.

Durga loves music.

ఈ వాక్యంలో verb-loves. దీన్ని helping verb+principal verb గా వ్రాస్తే loves= does love

ఈ helping verb ని తీసుకోండి. దాన్ని tag లో మొదట వ్రాయాలి.

2. చెప్పిన వాక్యంలో 'not'ఉందో లేదో చూడండి. 'not' లేకపోతే Question tagలో 'not'ని ఉపయోగించాలి. ఇచ్చిన వాక్యంలో 'not'ఉంటే Question tag లో 'not' ని ఉపయోగించకూడదు.

ఈ వాక్యంలో not లేదు. కనుక helping verb తరువాత not వ్రాయాలి. ఇప్పటికి (1)+(2) కలిపితే does not అయ్యింది.

3) ఇచ్చిన వాక్యంలో subject (కర్త) ఏమిటో చూసి ఆ కర్తకి సంబంధించిన pronoun ని select చేసుకోండి.

ఈ వాక్యంలో subject - Durga

ఇది III person, singular number ఉంది.

III person singular pronouns - he, she, it

ఈ వాక్యంలో subject Durga స్త్రీ కనుక pronoun she ని తీసుకోవాలి. ఇప్పుడు (1)+(2) కి (3) ని కలపండి.

does not she

doesn't sheఅని వ్రాసి question mark పెట్టండి.

ఇప్పుడు tag - doesn't she?

పరీక్షలో జవాబు వ్రాసినప్పుడైతే ఇచ్చిన వాక్యం వ్రాసి, తరువాత 'కామా(,)' పెట్టి ఈ tag ని వ్రాయండి.

Durga loves music, doesn't she?

సంభాషణల్లో ఇలా ఇది జవాబు. yes, she does అంటారు.

Durga loves music ఇది positive statement.

doesn't she? - negative tag.

nagative statement ఉంటే positive tag ఉంటుంది.

ప్రశ్న వేసేవాడు తనకు ఎలాంటి సమాధానం కావాలనుకుంటే దానికి తగ్గట్లుగా statement, tag ఉండాలి.

Does Durga love music అని ప్రశ్నవేస్తే జవాబు yes అని గానీ no అని గానీ రావచ్చు. కానీ ఒక statement, tag రూపంలో అడిగినప్పుడు statement ఎలాగుంటుందో జవాబు అలాగే ఉంటుంది. అంటే tag కు వ్యతిరేకంగా ఉంటుంది.

2) Gopal is an honest man.

Gopal is an honest man, isn't he?

3) India did not win the world cup last year.

India did not win the world cup last year, did they?

ఇక్కడ India అంటే Indian team. అంటే players of Indian team.

ఒక ప్రత్యేకమైన ప్రయోగం -

4) I am a clever man.

దీనికి question tag

I am a clever man, aren't I? ( am n't I కాదు)

5) There has been heavy violence in Kashmir.

ఇలా there తో మొదలయ్యే వాక్యాలకి, tag లో కూడా there ఉండాలి.

There has been heavy violence in Kashmir, hasn't there?

కొన్ని వాక్యాలలో not కనబడదు. hardly, scarcely, seldom, rarely లాంటి పదాలు.

వీటిలో not ఉన్నట్లే వీటిలో negative meaning ఉంది.కనుక tag లో not ఉండకూడదు.

6) Our M.L.A rarely( seldr) visits his constituency, does he?

Everybody, nobody ఇవి singular number నే సూచిస్తాయి. కానీ వీటిలో plural sense ఉంది.

7) No one attended the class అంటే class కి రావలసిన వాళ్ళు ఎవరూ రాలేదని అర్థం. అప్పుడు tag లో they ఉపయోగించాలి.

ఈ వాక్యానికి No one attended the class, did they?

8) Every was present in the class, weren't they?

జవాబు yes; they were.

Im peretive sentence ( order or request or wish) ల సందర్భంలో tag లో future tense లో helping verb - will or shall ఉండాలి. will you? .. won't you? అని అడిగేవాడు ఎలాంటి సమాధానం కోరుతున్నాడో దాన్ని బట్టి tag ఉండాలి.

9) Don't waste time, will you?

జవాబు No; i won't. కావలసిన జవాబు ఇది.

10) Study well; won't you?

జవాబు yes; I shall.

కావలసిన జవాబు positive గా ఉండాలంటే tag లో negative (not) ఉండాలి. Negative గా ఉండాలంటే tag positive (not ఉండకూడదు) గా ఉండాలి.

11) Let me sea the book, won't you?

జవాబు yes; I shall

# KEY TO THE EXERCISES

## *Ex 1:*

1. India is my mother land.
2. Telugu is my mother tongue.
3. The cow eats grass.
4. The earth moves round the sun.
5. The elephant has a trunk.
6. There are seven days in a week.
7. A week has seven days.
8. There are thirteen districts in Andhra pradesh.
9. Andhra pradesh has thirteen districts.
10. Kalidas is a great poet.
11. The Ramayana and the Mahabharatah are great epics.
12. Untouchability is a great sin.
13. Walking is a good exercise.
14. He has a strong determination.
15. I am hungry.
16. God is everywhere.
17. Balu sings songs.
18. It often rains in Assam.
19. My brother reads The Hindu.
20. Dates grow in arab Countries.



## *Ex 2:*

1. Kalam is a scientist.

Q1. Who is Kalam?
Q2. Is Kalam is a Scientist?
A1. yes; Kalam is a Scientist.
A2. No; Kalam is not a Scientist.

2. There are twelve months in a year.

Q1. How many months are there in a year?
Q2. Are there twelve months in a year.
A1. Yes; there are twelve months in a year.

A2. No; there are not twelve months in a year.

3. My father drinks coffee in the morning.

Q1. What does your father drink in the morning?

Q2. Does your father drink coffee in the morning?

A1. Yes; my father drinks coffee in the morning.

A2. No; my father does not drink coffee in the morning.

4. Water boils at 100 degress centigrade.

Q1. At what temperature does water boil?

Q2. Does water boil at 100 degrees centigrade?

A1. Yes; water boils at 100 degrees centigrade.

A2. No; water does not boil at 100 degress centigrade.

5. There are seven colours in the rainbow.

Q1. How many colours are there in the rainbow?

Q2. Are there seven colours in the rainbow?

A1. Yes; there are seven colours in the rainbow.

A2. No; there are not seven colours in the rainbow.

6. The rainbow has seven colours.

Q1. How many colours does the rainbow have?

Q2. Does the rainbow have seven colours?

A1. Yes; the rainbow has seven colours.

A2. No; the rainbow does not have seven colours.

7. Latha writes stories.

Q1. What does Latha write?

Q2. Does Latha write stories?

A1. Yes; Latha writes stories.

A2. No; Latha does not write stories.

8. The stars shine during night time

Q1. When do the stars shine?

Q2. Do the stars shine during night time?

A1. Yes; the stars shine during night time.

A2. No; the stars do not shine during night time.

9. Varanasi is on the banks of the Ganges.
Varanasi is on the Ganges.

Q1. Where is Varanasi?

Q2. Is Varanasi is on the Ganges.

A1. Yes; Varanasi is on the Gangaes.
A2. No; Varanasi is not on the Ganges.
10. Nuzvid is famous for mangoes.
Q1. What is Nuzvid famous for?
Q2. Is Nuzvid famous for mangoes?
A1. Yes; Nuzvid is famous for mangoes.
A2. No; Nuzvid is not famous for mangoes.
11. The Dogs bark.
Q1. What do the dogs do?
Q2. Do the dogs bark?
A1. Yes; the dogs bark.
A2. No; the dogs do not bark.
12. There are nearly 2796 Lauguages in the world.
Q1. How many languages are there in the world.
Q2. Are there 2796 languages in the world?
A1. Yes; there are nearly 2796 languages in the world.
A2. No; there are not 2796 languages in the world.
13. The birds fly.
Q1. What do the birds do?
Q2. Do the birds fly?
A1. Yes; the birds fly.
A2. No; the bird do not fly.
14. The boys fly kites.
Q1. What do the boys do?
Q2. What do the boys fly?
A1. Yes; the boys fly kites.
A2. No; the boys do not fly kites.
15. The camel has a long neck.
Q1. Does the camel have a long neck?
A1. Yes; the camel has a long neck.
A2. No; the camel does not have a long neck.

***Ex 3:***

1. Raja is acting in this film.
Q1. Who is acting in this film?

Q2. Is Raja acting in this film?
A1. Yes; Raja is acting in this film.
A2. No; Raja in not acting in this film.
2. Sowjanya is preparing for APPSC Examinations.
Q1. Is Sowjanya is preparing for APPSC examinations?
A1. Yes; Sowjanya is preparing for APPSC examinations.
A2. No; Sowjanya is not preparing for APPSC examinations.
3. Ravindra is contesting Loksabha election.
Q1. What is Ravindra contesting?
Q2. Is Ravindra is contesting Loksabha election?
A2. Yes; Ravindra is contesting Loksabha election.
A2. No; Ravindra is not contesting Loksabha election.
4. My brother is comming from the US today.
Q1. Where is your brother comming from ?
Q2. When is your brother comming from the US?
Q3. Is your brother is comming from the US today
A2. Yes; my brother is comming from the US today.
A2. No; my brother is not comming from the US today.
5. You are lying.
Q1. Who is lying?
Q2. Are you lying? or Am I laying.
A2. Yes; You are lying.
A2. No; You are not lying.
6. I am reading the Ramayana.
Q1. What are you reading?
Q2. Are you reading the Ramayana?
A1. Yes; I am reading the Ramayana.
A2. No; I am not reading the Ramayana.
7. It is getting dark.
Q1. Is it getting dark?
A1. Yes; It is getting dark.
A2. No; It is not getting dark.
8. They are quarreling amoung themselves.
Q1. What are they doing?
Q2. Are they quarreling amoung themselves?

A1. Yes; They are quarreling amoung themselves.
A2. No; They are not quarreling amoung themselves.
9. Tomatoes are selling at sixty rupess per Kg.
Q1. At what price are the tomatoes selling?
Q2. Are Tomatoes selling at sixty rupess per Kg.
A1. Yes; Tomatoes are selling at sixty rupess per Kg.

A2. NO; Tomatoes are not selling at sixty rupess per Kg.
10. The sun is setting.
11. Radha is reading the newspaper.

12. The NGOs are agitating for the new pay scales.
Q1. What are the NGOs agitating for?
Q2. Are the NGOs agitating for the new pay scales?
13. We are watching cricket match on TV.
14. Veerendra is writing a new novel.
15. Santha is cooking.

***Ex 4:***

1. The Gowthami express has just arrived on the platform.
2. She is forty years old. Yet she has not married.
3. I have read sixty pages in the novel sofar.
4. Have you ever gone to Varanasi?
5. Mohan has been retired this month.
6. Vijay has completed thirty years of service.
7. I have given up smoking cigeretts.

8. I have never seen her to be so angry.
9. I have been seen my father for five years.
10. The Australians have never won in this ground.

11. Ramakrishna has been under suspension for ten years now.

***Ex 5:***

1. I have been learning English for two years.
2. The employees have been agitating for twenty days.
3. The child has been crying for one hour.
4. The APSRTC has been plying buses for 55 years.
5. This film has been showing for 200 days.
6. Mr. Gopalam has been engaging English coaching classes since the year 2000.
7. She has been drawing the pictures for two hours.

8. There have not been rains here for two years.
9. Nani has been watching TV since morning.
10. His nose has been bleeding since one hour. (bleed-bled-bled)

***Ex 6:***

My native place is Tallapudi. This is a village and a mandal head quaters too. This is on the (banks of the) Godavari. Its population is around ten thousand. Ninety percent of them are below middle class. Agriculture is their main occupation. The farmers grow paddy. sugarcane, cotton, tobacco and vigitables. Rajamahendravarm is the nearest town. It is 25 Km away from here. Busses ply for every half an hour. Tallapudi is developing in all fields in recent years. There is a Govt. Junior College, Private junior and degree college, B.Ed college and a DIET college here. Private high schools have mushroomed in Tallapudi. There is a primary health centre and some private hospitals as well. Patients rush to Rajamahendrvaram in emergency conditions. People get drinking water from the Godavari. There is a lift irrigation canal for agriculture. Life here is calm and peaceful. I love my village.

***Ex 7:***

1. Nehru was the first prime minister of India.
2. Hitler was a dectator.
3. Ramdas was the mentor of Sivaji.
4. Lyla and Majnu were lovers.
5. Lava and Kusa were twins.
6. There were eight great poets in the Court of Krishnaraya.
7. Once England had a great empire.
8. He had four sons.
9. Colombus discoverd Amirica.
10. Swaroopa passed SSC in 2005.
11. Harihara and Bukka brothers founded Vijayanagara empire.
12. Buddha preached Ahimsa.
13. Dr. Prasad become the first Rastrapathi of India.
14. Gandhiji studied Barrister course in London.
15. My father was very fond of me.
16. There were 355 days only in the year 1752A.D.
17. The present English calender came into being in the year 45B.C.

